# క్రీడారంగం

## లాల్, ముఖర్జీల వైఖరి: చిదంబరం విమర్శ

### జూనియర్ పోటీలలో మిశ్రా పాల్గొంటారట

మద్రాసు, జూన్ 11 : అఖిల భారత లాన్ టెన్నిస్ సంఘం అధ్యక్షుడు శ్రీ ఎమ్ ఏ, చిదంబరం నిన్న నిక్కడ విలేఖరులతో ముచ్చటిస్తూ తమ సంఘం నిర్ణయించిన విదేశీ పర్యటనల కార్యక్రమాన్ని తగు కారణాలు లేకుండా ప్రేమ్‌జిత్‌లాల్, జె. ముఖర్జీ పాటించనందువల్లనే ఐరోపా టోర్నమెంటులలో తమకుతాముగా వారు పాల్గొనేందుకు అనుమతి యివ్వబడ లేదన్నారు.

భార్యకు నుస్తీసేరుతో లాల్, హాకీఆటలో నిపు నొప్పిపట్టిందని ముఖర్జీ యిచ్చిన సంజాయిషీలు ఆమోదయోగ్యం కావన్నారు. ఉగండా టోర్నమెంటులో పాల్గొనలేక పోవడానికి వారా కారణాలుచెప్పి నగ్రీ ఛాంపియన్ షిప్సులో పాల్గొనేందుకుమాత్రం ఇద్దరూ తమ సంసిద్ధత వెల్లడి చేశారన్నారు.

ఐరోపా పోటీలలో స్వయంపోదాలో పాల్గొనేందుకు లాల్, ముఖర్జీలకు అనుమతి యివ్వకపోవడక వారిపై క్రమశిక్షణచర్య తీసుకొనడం కాదన్నారు.

హైదరాబాద్ ఆటగాడు శ్రీ ఎస్. పి. మిశ్రా జూనియర్ టీము సభ్యుడుగా ఐరోపా లో తేలేదు టోర్నమెంటులలో పాల్గొంటారని ఆయనకు టెన్నిస్ కోచ్ స్టాన్ ఎడ్వర్డ్సు దర్శకులుగా వ్యవహరింప గలరని చెప్పారు.

## రాజధానిలో కబడి రిఫరీల పరీక్షలు

హైదరాబాద్, జూన్ 10 : భారత కబడి సమాఖ్య జూన్ 21 వ తేది నుంచి హైదరాబాద్‌లో అఖిలభారత కబడి రిఫరీ, అంపైర్ల పరీక్షలు జరుపనున్నది.

పరీక్షలకు హాజరయ్యే అభ్యర్థుల సౌకర్యార్థం హైదరాబాద్ కబడి అసోసియేషన్ ప్రత్యేక తరగతులు నిర్వహించదలచింది.

పరీక్షలకు సంబంధించినవివరాలను రాష్ట్ర సంఘ కార్యదర్శి శంకరగౌడ్‌వద్ద లభించగలవు.

## రష్యాకు ఫరూక్ ఆలీ పయనం

న్యూఢిల్లీ, జూన్ 10: రష్యాలోని ఆల్మాటాలో జూన్ 12 నుంచి 29 వరకు జరిగే ఆసియా చతురంగపోటీలలో పాల్గొనే నిమిత్తం భారత ఛాంపియన్ శ్రీ ఫరూక్ ఆలీ నేడిక్కడనుంచి బయలుదేరివెళ్లారు.

అఖిలభారత చతురంగ సమాఖ్య కార్యదర్శి శ్రీ కె. ఏ. రమణమూర్తి, చతురంగ అభిమానులు వీడ్కోలు యిచ్చారు.







# మార్కెట్ ధరలు

## హైదరాబాదు

హైదరాబాద్, జూన్ 11 :

శ్రీ కొత్తూరు సీతయ్యగుప్త, ఉస్మాన్‌గంజ్ హైదరాబాదు.

| | |
|---|---|
| 11. తెల్ల జొన్నలు | 60/62 |
| 12. చాస్తి జొన్నలు | 50/53 |
| 13. పచ్చ జొన్నలు | 50/52 |
| 14. పసుపు | 150/154 |
| 15. కందులు | 87/94 |
| 16. ఎర్రకందులు | 75/87 |
| 17. పెసలు | 85/86 |
| 18. మినుములు | 66/68 |
| 19. లంకలు | |
| 20. శనగలు | 63.00/65.00 |
| 21. ఉలవలు | 40/42 |
| 22. బీల్లము | 70/80 |
| 23. మిర్చి | 150/205 |
| 24. చింతపండు | 87/109 |
| 25. ఉల్లిగడ్డ | 14/23.00 |
| 26. గోధుమలు | 90/93 |
| 27. ఎర్రగోధుమలు | |
| 28. మక్క గోధుమలు | 80/82 |
| 29. కుసుమలు | 64/65 |
| 30. నువ్వులు | 140/150 |
| 31. ఇలాతి పలుకు చిన్నవి | 88/97 |
| 32. ఇలాతి పప్పు పెద్దది | 132/135 |
| 33. ఆముదాలు | 65/66 |
| 34. పత్తి గింజలు | 37/42 |
| 35. నూనె | 22.25 |
| 36. పెద్ద కందిపప్పు | 116/122 |
| 37. చిన్న కందిపప్పు | 112/115 |
| 38. పెసరపప్పు | 93/94 |
| 39. శనగపప్పు | 113/115 |
| 40. సీన శనగపప్పు | 73/77 |
| 41. మినప్పప్పు | 90/91 |
| 42. లంక పప్పు | |
| 43. ధనియాలు | 168/175 |
| 44. ఇలాతికాయ. | |

### వెండి మార్కెట్

హైదరాబాద్, జూన్ 11 : సముద్రాల రాఘవులుగారి చంద్రయ్య వెండి బంగారం వర్తకులు, సిద్దియాంబర్ బజార్, హైదరాబాదు, ఫోన్ నంబరు 42080.

1. వెండి 1 కిలోగ్రాము రు. 245—00
2. వెండి 10 గ్రాములు రు. 2—50

# మద్రాస్ మార్కెట్

## వెండి ధరలు

మద్రాసు, జూన్ 11 :

వెండి కిలోగ్రాం రు. 250.00
వెండి చిల్లరధర (10 గ్రాములు)రు. 2.53

### వేరుశనగ నూనె

మద్రాసు గిడ్డంగివద్ద చిల్లరగా (100 కిలోగ్రాములు) రెడి రు. 217.00

### వేరుశనగ పిండి

(72 కిలోగ్రాముల బస్తా) రు. 32.50

### ఆముదం

(100 కిలో గ్రాం)
తిరుపత్తూరు రు. 147.00

### వేరుశనగ కాయలు

80 కిలోగ్రాం
బోల్డు సుపీరియర్ కోడై పట్టాణి రు. 91.00

### కొబ్బరినూనె

(16.5 కిలోగ్రాం)
క్వీలన్ యం. యన్ రు. 46.50
ఆలెప్ రు. 45.50
రాజా రు. 45.50

# న్యూయార్క్ పత్తిమార్కెట్

న్యూయార్కు, జూన్ 10: జులై వాయిదా ధరలు నేడు ఇలా వున్నవి:

ప్రారంభం ధర 32.80
ముగింపు ధర 32.80

# ఆకాశవాణి

[తెలుగులో వార్తలు : ఉ॥ 7; మ॥ 1-50; సా॥ 7; ఆంగ్లంలో వార్తలు : ఉ॥ 8; మ॥ 1-30; సా॥ 6; రా॥ 9.]

**శనివారం, జూన్ 13**

## హైదరాబాద్ (ఎ)

(405.4 మీటర్లు)

ఉ. 6-30 సుప్రభాతం: 6-45 భక్తిరంజని: 6-55 సూక్తిముక్తావళి: 7-15 సంకీర్తనం (భక్తిపాటలు) 7-30 సెమ్మంగుడి శ్రీనివాసఅయ్యర్ 7-45 వింటు విద్యాంసులు 8-15 ఎకరువాడసరె 9-00 వాతావరణసూచన.

మ. 12-30 కార్మికుల కార్యక్రమం 1-00 వా. భువనేశ్వరి 1-30 వాద్య చిత్రం 1-40 హిం. వా. 2-00 బి వరె 2-10 ఉ. వా. 2-20 బి వరె 3-30 బాలానందం.

సా. 6-00 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాం. వా. 6-15 ప్రస్తుతాంశం 6-20 నవరస ప్రసంగం (హిందీ) 7-25 శ్రోతల ఉత్తరాలకు జవాబులు (ఉర్దూ) 7-30 చిత్రసీమ 7-45 వైట్ హావ్‌మన్ నాటిక 8-00 ప్రసంగిని (ఉర్దూ) 8-10 బివరె 8-30 ఢిల్లీనుంచి రిలే 8-40 వినవు సంగీతం 8-45 ఈ మాసపు పాట : వి శ్రీనాథ్ 8-50 వినవు సంగీతం 8-55 ఆంగ్ల ప్రసంగం 9-15 ఉ. వా: 9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము 10-55 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన,

## హైదరాబాద్ (బి)

కడప
(265.5 మీటర్లు)
విశాఖపట్నం
(322.6 మీటర్లు)
సా. 6-00 నుండి రా. 9-30 వరకు

(89.42 మీటర్లు)
ఉ॥ 6-30 ఎ వరె 7-45 ప్రసార సమాప్తి.

(49.02 మీటర్లు)
8-00 ఎ వరె

(42.02 మీటర్లు)
మ॥ 12-30 ఎ వరె 2-00 వాతావరణ సూచన 2-30 ప్రసార సమాప్తి. 3-30 ఎ వరె 4 00 ప్రసార సమాప్తి.

(60.12 మీటర్లు)
సా॥ 6-00 ఎ వరె 6-20 గ్రామస్థుల కార్యక్రమం 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 ఎ వరె 8-00 జె. విజయలక్ష్మి 8-00 ఎ వరె 9-15 ఆంగ్ల కార్యక్రమం 9-25 వినవు సంగీతం 9-30 ఎ వరె 11-05 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి. జనగణమన.

## విజయవాడ

(357.1 మీటర్లు)

ఉ. 6-30 శుభోదయం 6-45 భక్తి రంజని : 6-55 సూక్తిముక్తావళి 7-15 ప్రసార విశేషాలు 7-20 సంగీత శిక్షణ 7-30 వాద్య బృందము 8-15 ప్రాంజలి 8-30 ఎస్. వి. పార్థసారధి.

మ॥ 12-30 కార్మికుల కార్యక్రమం 1-00 కె. జె. జోష్: దిల్‌రుబా 1-30 వార్తలువ్యాఖ్యలు 1-40 హిం. వా. 2-00 వాతావరణసూచన,

సా. 6—00 స్థానిక ప్రకటనలు 6—05 ప్రాం. వా. 6-15 ప్రస్తుతాంశం 6-20 గ్రామస్థులకార్యక్రమం 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 ప్రసంగం 7-40 ఈ వారపాట 7-45 నాటిక 8-00 శ్రోతలు కోరినపాటలు 8-30 (ఢిల్లీనుంచి రిలే) 8-45 లలితసంగీతం 8-55 ఆం. ప్రసంగము 9-15 ఆం. కార్యక్రమం 9-25 పల్లెపాట 9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం 11-05 వాతావరణసూచన, ప్రసార సమాప్తి జనగణమన.

## మద్రాస్ (ఎ)

(416.7 మీటర్లు)

ఉ॥ 6-45 మంగళగానం 6-50 నేటి కార్యక్రమ వివరణ 6-55 అరుల్‌వాక్కు 7-00 తుది పాడల్‌గళ్ 7-15 త. వా. 7-30 వి. రామచంద్రన్ 8-00 మధుర గీతం.

మ॥ 1-00 కదంబం 1-30 గానమంజరి 1-40 హిం. వా. 1-50 వాతావరణ సూచన, గీతమంజరి 2-00 త. వా. 2-10 వాద్యగోష్ఠి 2-25 యు. వి. కృష్ణఅయ్యర్ 3-00 ప్రసార సమాప్తి.

సా॥ 5-30 టి. ఎ. హరిహరన్ : వేణువు 6-05 ప్రాంతీయ కౌముదిగళ్ 6-15 కౌముది కురిప్పుగళ్ 6-20 గ్రామస్థులకు (తమిళం) 7-15 త. వా. 7-30 టి. వి. రత్నం టి: కె. రామచంద్రన్ : 8-30 రేడియో వార్తావాహిని 8-40 వాద్యసంగీతం 9-00 వి తగానం 9-30 అఖిల భారత సంగీత కార్యక్రమము 11-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన.

## మద్రాస్ (బి)

(211.3, 60.98 మీ.)

ఉ॥ 6 45 ఎవరె 7-15 సుప్రభాతం 7-30 ఎ వరె.

(211.3, 41.90 మీటర్లు)

మ॥ 1-00 ఎ వరె 1-40 గీతమంజరి 2-00 ప్రసారసమాప్తి. 3-30 మ్యూజిక్యూరియల్ 4-20 పిల్లలకు (ఆంగ్లం).

(211.3, 60.98 మీటర్లు)

సా॥ 5-30 పాశ్చాత్య సంగీతం 6-05 ఎ వరె 6-20 వాతావరణ సూచన 6-30 కార్యక్రమ వివరణ (తమిళం) 6—35 టి. ఎ. హరిహరన్: వేణువు 7-15 సంగీతమాల 7-30 నాటిక (తమిళం) 8-30 వి. రామచంద్రన్ 8-55 ఆం. ప్రసంగం 9-15 ఆం. కార్యక్రమం 9-30 ఆం. ప్రసంగం 9-40 వినవు సంగీతం 9-45 పాశ్చాత్య సంగీతం 11-05 ప్రసార సమాప్తి జనగణమన.



శ్రీమతి కర్రి వీరపరిపూర్ణమ్మగారు

## సోమరాజు ఇల్లిందలపరు పంచాయతీ ఎన్నికలు

తణుకు, జూన్ 11: పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా సోమరాజు ఇల్లిందలపరు గ్రామపంచాయతీకి క్రిందివారు ఎన్నికైనట్లు తెలియుచున్నది.

శ్రీమతి కర్రి వీర పరిపూర్ణమ్మ (అధ్యక్షురాలు), శ్రీ కర్రి సత్తిరెడ్డి (ఉపాధ్యక్షులు), శ్రీమతి కర్రి నాగమ్మ, సర్వశ్రీ తమ్మలపల్లి కృష్ణమూర్తి, వసుంధరమ్మ, పెంటపాటి చినవెంకన్న, కర్రి సత్తిరెడ్డి, పసుమటి నరసింహమూర్తి, చీలి వెంకన్న (సభ్యులు).

## వివాహము

కాకినాడ, జూన్ 10: శ్రీ బందారు తమ్మయ్యగారు తమ అయిదవ కుమారుడు చి. బసవేశ్వర్ (ఆంధ్రపత్రిక కార్యాలయ ఉద్యోగి) కు శ్రీ నగినాల బాలధూపయ్యగారి జ్యేష్ఠపుత్రిక చి. సౌ. విమలమ ఇచ్చి మే 30 వ చిలకలూరిపేటలో వివాహం జరిపించారు.

## రాజభవన్ వార్తలు

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 10: గవర్నర్ శ్రీ పట్టాభి రామారావు ఇంకా పెన్నలు... శ్రీమతి సీతమ్మ భానుపిళ్లైగార్లు నేటి ఉదయం బేగంపేటలో శ్రీ కరువెళ్ళ జాకోబ్ దంపతులను వారి స్వగృహములో కలుసుకున్నారు.

రివెన్యూ బోర్డు సభ్యులు శ్రీ వి. రాజేశ్వరరావును, శ్రీ ఖాన్‌సాహెబ్ దోస్త్ మహమ్మద్ అల్లాదిన్, ఎ. ఎస్. రామలాల్ (రిటైర్డు డి. పి. ఐ) గార్లను గవర్నర్ కలుసుకున్నారు.

సాయంత్రము గవర్నర్ దంపతులు ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు (హైదరాబాద్) శ్రీ ఎ. కె. పిళ్లైను, ఆయన భార్యను కలుసుకున్నారు.

## గవర్నర్ కార్యక్రమం

హైదరాబాద్, జూన్ 11: ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ పట్టాం థానుపిళ్లై ఈనెల 17 వ తేదీ ఇక్కడినుండి విమానంలో మద్రాసు వెళతారు. మరుసటిరోజు మద్రాసు నుండి తిరుపతి వెళ్ళతారు. 22 వ తేదీన హైదరాబాదు తిరిగివస్తారు.

ఈనెల 25 వ తేదీ సాయంత్రము 4 గం॥ లకు పబ్లిక్‌గార్డెన్స్ (హైదరాబాద్) లోని జూబిలీహాలులో శాసనసభ, పరిషత్ సభ్యుల సమావేశంలో గవర్నర్ ఉపన్యసిస్తారు.

సిడ్నీ, జూన్ 11: ప్రపంచం మొత్తం మీద ఎక్కడా పండని వరిపంటలు, ఎకరాకు మూడున్నరటన్నులు ఆస్ట్రేలియాలో పండిస్తున్నారు.





ప్రధాని పదవి స్వీకరించిన శ్రీ శాస్త్రిని కౌగలించుకొని అభినందిస్తున్న శ్రీ నందా.

# కొత్తగా చేరిన ముగ్గురు కేంద్ర మంత్రులు

## శ్రీమతి ఇందిర

శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి మంత్రివర్గంలో కొత్తగా ప్రవేశించిన ముగ్గురు అభ్యర్థుల జీవితసంగ్రహాలు దిగువ పొందుపరచబడ్డాయి.

47 ఏళ్ల ప్రాయంగల శ్రీమతి ఇందిరాగాంధీ బాల్యజీవితం, తీవ్రరాజకీయ వాతావరణంలో గడిచిపోయింది. ఆమె తల్లిదండ్రులు, తదితర ఆత్మబంధువులు ఎవరో ఒకరు ఎప్పుడూ జైలుకు వెళ్లటం రావటం జరుగుతూ ఉండేది.

అప్పట్లో ఆమెను 'ఇందిరా ప్రియదర్శిని' అని వ్యవహరిస్తూండేవారు. ఆమె విద్యాభ్యాసం మొదట ప్రథమంగా స్విట్జర్లెండులో ప్రారంభమైంది. తరువాత ఆక్స్‌ఫర్డ్‌లోను, శాంతినికేతన్ లోని విశ్వభారతి వద్దను ఆమె ఉన్నతవిద్య లభ్యసించింది.

20 సంవత్సరాలలోపు వయస్సులోనే ఆమె రాజకీయాల్లో పాల్గొన నారంభించింది. అలహాబాద్‌లో అసహాయోద్యమంలో పాల్గొన్న కాంగ్రెస్ వాదుల సహాయార్థం, ఆమె ఒక బాలల పటాలాన్ని తయారుచేసింది. ఈ పటాలం 'వానరసేన'గా వ్యవహరింపబడుతూ ఉండేది, క్రమంగా యీ సంస్థ 60 వేల మంది సభ్యులతో ఒక ప్రబలమైన బలంగా రూపొందింది.

ఇంగ్లండ్, భారతదేశాల్లోని విద్యార్థి ఉద్యమాల్లో గొప్ప ఆసక్తితో పనిచేసి ఉన్నందువల్ల, 21 సంవత్సరాల ప్రాయంలో ఇందిర కాంగ్రెస్‌లో ప్రవేశించింది. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనందుకుగాను ఆమె 13 మాసాల జైలుశిక్ష అనుభవించింది.

1937 ఎన్నికలప్పుడు ఆమె, జన సామాన్యంతో ముఖ్యంగా గ్రామాల్లోని మహిళలతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకున్నది 1942 లో స్వర్గీయ ఫిరోజ్ గాంధీతో ఆమెకు వివాహం జరిగింది. పెండ్లి పందిరి పర్చు మణగకుండనే దంపతులిరువురూ అరెస్టు చేయబడ్డారు.

1947 భారత పాకిస్తాన్ల విభజన అనంతరం, ఢిల్లీలో అల్లర్లు చెలరేగిన ప్రాంతాల్లో మహాత్మాగాంధీ నాయకత్వాన ఆమె పనిచేసింది.

కాంగ్రెస్ కార్యవర్గ సభ్యురాలుగా మాత్రమేకాకుండా కాంగ్రెస్ మహిళా విభాగం అధ్యక్షురాలుగాను, కేంద్ర ఎన్నికల మండలి కేంద్ర పార్లమెంటరీబోర్డు అఖిల భారత కాంగ్రెస్ సంఘం తాలూకు యువజన సలహామండలి సభ్యురాలుగా గూడా ఆమె పనిచేస్తున్నది. 1959 లో ఆమె కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని అలంకరించిన సమయంలో పార్టీకి అనేక రాజకీయ విజయాలు సిద్ధించినవి.

బాల్ సహయోగ్‌కు, బాలల సంక్షేమానికి సంబంధించిన భారతీయమండలికీ ఆమె అధ్యక్షురాలు. అంతర్జాతీయ బాలల సంక్షేమ సంఘానికి ఉపాధ్యక్షురాలు.

శ్రీమతి ఇందిరాగాంధీ, ఆసియా, యూరోప్, అమెరికా, రష్యాదేశాల్లో పర్యటించిఉన్నారు ఇటీవలనే ఆమె అనేక ఆఫ్రికాదేశాల్లో సుహృద్భావయాత్ర చేసివచ్చారు.

## శ్రీ సంజీవరెడ్డి

1956 అక్టోబర్‌నాటి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్‌కు శ్రీ నీలం సంజీవరెడ్డి మొదటి ముఖ్యమంత్రిగా పనిచేశారు. ఆయన వయస్సు 51 సంవత్సరాలు. 1960 జనవరిలో భారత జాతీయకాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికైన సమ్మేట ఆయన తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు.

1960 లో బెంగుళూర్‌లోను, 61 లో భావనగర్‌లోను, 62 లో పాట్నాలోను జరిగిన కాంగ్రెసు మహాసభలకు ఆయన అధ్యక్షత వహించారు.

కాంగ్రెసు అధ్యక్షపదవినుంచి వైదొలగిన తరువాత 1962 మార్చిలో ఆయన రెండవసారి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయినారు. రెండుసంవత్సరాలు ఆ పదవిని నిర్వహించినమీదట కర్నూలు రోడ్డు రవాణా జాతీయకరణకు తాలూకు అభియోగంలో సుప్రీంకోర్టు యిచ్చిన తీర్పును పురస్కరించుకొని శ్రీ సంజీవరెడ్డి స్వచ్ఛందంగా ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యిచ్చారు. ప్రజాజీవితంలో అత్యున్నత ప్రమాణాలను నెలకొల్పాలన్న ఆశయమే ఆయనను యీ చర్యను పురికొల్పింది. ఈ శాసనసభా కాంగ్రెస్‌పార్టీ నాయకుడుగా తాను తిరిగి ఎన్నిక అయినప్పటికీ నూతనమంత్రివర్గం ఏర్పాటును శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిని ఆహ్వానించవలసినదిగ ఆయన గవర్నర్‌కు సలహాయిచ్చారు.

మొదట్లో శ్రీ సంజీవరెడ్డి, ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో రెండు సంవత్సరాలు, మంత్రిగా పనిచేసిఉన్నారు. కొద్దికాలంపాటు రాజ్యసభ సభ్యుడుగా గూడా పనిచేశారు.

స్వాతంత్ర్యోద్యమంలో ఆయన పెక్కుసార్లు జైలుకు వెళ్లారు. 'క్విట్ ఇండియా' ఉద్యమంలో ఆయన అరెస్టుచేయబడి 1945 జూన్ వరకు నిర్బంధంలో ఉంచబడ్డారు.

ఆయన అనంతపురం ఆర్ట్సు కాలేజీలో విద్యాభ్యాసము చేశారు. 1936 నుంచి పది సంవత్సరాలు ఆంధ్ర కాంగ్రెస్ సంఘం కార్యదర్శిగా పనిచేశారు. 1951 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రమంత్రి పదవికి రాజీనామా చేసి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికైనారు. ఆవడి కాంగ్రెస్‌వరకు అఖిల భారత కాంగ్రెస్ సంఘం కార్యవర్గ సభ్యుడుగాను పార్లమెంటరీ బోర్డు సభ్యుడుగాను ఆయన పనిచేశారు.

## శ్రీ ఎస్. కె. పాటిల్

గత ఆగస్టులో కామరాజ్ పథకంక్రింద కేంద్ర మంత్రివర్గంనుంచి వైదొలగిన ఆరుగురు మంత్రులలో శ్రీ ఎస్. కె. పాటిల్ ఒకరు.

రెండవ సార్వత్రిక ఎన్నికల్లో లోక్‌సభకు ఎన్నికైన తరువాత 1957 మేలో ఆయన కేంద్ర నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి అయినారు. 1958 ఏప్రిల్‌నుంచి ఒక సంవత్సరంపైగా రవాణా, తంతి తపాలా మంత్రిగా పనిచేసి ఆటుపిమ్మట ఆహార వ్యవసాయశాఖ మంత్రిగా, నాలుగేళ్లు పనిచేశారు.

శ్రీ పాటిల్ వయస్సు 64 సంవత్సరాలు. జాతీయ కార్యకలాపాలలో ఆయన అనేకసార్లు జైలుశిక్ష అనుభవించారు, గత 31 సంవత్సరాలుగా ఆయన అఖిలభారత కాంగ్రెస్‌సంఘం సభ్యుడుగా, ఉంటున్నారు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడు.

బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్‌సంఘం కార్యదర్శిగా ఆయన 17 సంవత్సరాలుగా పనిచేశారు. 1946 నుంచి '57 వరకుగాని అధ్యక్షుడుగా వ్యవహరించారు. బొంబాయి మేయరుగా 1949–నుంచి '52 వరకు– మూడుసంవత్సరాలు పనిచేశారు.

## 20 మంది నాగ ద్రోహుల వధ

ఇంఫాల్, జూన్ 9: మణిపూర్‌లో తమెంగ్‌లాంగ్ సబ్ డివిజన్‌కు చెందిన 'తామా' ప్రాంతం అడవులలో నాగవిద్రోహుల గూఢస్థావరంపై భారతరక్షణ బలాలు ఈ నెల 5 న దాడిచేశాయి. ఆ సందర్భంలో 20 మంది నాగద్రోహులను ఈ సైన్యాలు వధించాయి. భారత రక్షణబలాలకు ఎటువంటి నష్టము వాటిల్లలేదు.

ఈ గూఢస్థావరాన్ని నాగవిద్రోహులు ఆయుధోత్పత్తి కేంద్రంగా వినియోగిస్తున్నారు.

జరిగిన వారంరోజుల్లో జరిగిన సైనిక చర్యం ఫలితంగా 43 మంది నాగద్రోహుల వధింపబడినారు.

# రాజధాని వార్తలు

## తెలుగు పండితుల ట్రయినింగ్ తరగతుల నిర్వహణకు నిర్ణయం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 10: తెలుగు పండితుల ట్రయినింగు తరగతులను నిర్వహించుటకు ఆంధ్ర సాహిత్య పరిషత్ నిర్ణయించినది.

10–1–64 నాడు జారీచేయబడిన ఎం. ఎస్. నంబరు 112 జి. వో. ప్రకారము, పరిషత్ నిర్వహించుచున్న విశారద పరీక్షను తెలుగు పండితుల నియామకానికి తగిన యోగ్యతగా నిర్ణయించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఆమోదించినది.

విశారద పరీక్షలో మాత్రమే ఉత్తీర్ణులైనవారికి రు. 70–100 గ్రేడును, విశారద పరీక్షతోపాటు ఉస్మానియా యూనివర్సిటీవారి డిప్లమా కానీ, లేక మరి ఓరియంటల్ పరీక్షగానీ ప్యాస్ అయినచో 80—135 గ్రేడును, విశారద పరీక్ష మరియు ఉస్మానియా యూనివర్సిటీ డి. వో. ఎల్. లేక ఏ యితర ఓరియంటల్ పరీక్షలో కానీ ఉత్తీర్ణత పొంది, తెలుగు పండితుల ట్రయినింగ్ కోర్సును గూడా పూర్తి చేసినచో 80—150 గ్రేడును యిచ్చుటకు ప్రభుత్వము నిశ్చయించినది.

విశారద పరీక్షతోపాటు డి. వో. ఎల్. గానీ, లేక మరి ఏ యితర ఓరియంటల్ పరీక్షగానీ ఉత్తీర్ణులైనవారికి తెలుగు పండితుల ట్రయినింగ్ పొందుటకు అవసరమైన తరగతులను నడుపుటకు గూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము—పరిషత్తుకు అధికారము యిచ్చినది. అందుకై పైన పేర్కొన్న యోగ్యతలు కలిగి ట్రయినింగ్ పొందకోరు అభ్యర్థులు పరిషత్ కార్యాలయానికి జూన్ 20 వ తేదీలోగా అభ్యర్థిత్వ పత్రములను పంపుకో వచ్చును.

ఈ తరగతులలో ప్రవేశించు అభ్యర్థులు విద్యాశాఖ ఉద్యోగములలో ఉన్నచో విద్యాశాఖ వారి అనుమతి సంపాదించుకొనవలసి ఉండును. తరగతులు ఆంధ్ర సారస్వత పరిషత్ కార్యాలయములోనే నిర్వహించబడును. అభ్యర్థులు భోజనవసతి సదుపాయములు వారే ఏర్పాటు చేసుకోవలయును. తదితర వివరాలు పరిషత్ కార్యాలయము నుండి తెలుసుకొనవచ్చును.

## శ్రీ జి. బ్రహ్మయ్య సంతాపం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 10: స్వర్గీయ పండిత నెహ్రూ అస్థి నిమజ్జన విజయవాడ వద్ద కృష్ణానదిలో జరుపు సందర్భమున 5 గురు వ్యక్తులు తమ ప్రాణాలను పోగొట్టుకున్నందుకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య తమ గాఢ సంతాపాన్ని నేడు వ్యక్తపరచారు.

ఆయన నేడుచేసిన ఒక సంతాప ప్రకటనలో యింకా ఇలా పేర్కొన్నారు: "ఈ దారుణ సంఘటనకు నేను మిక్కిలిగా ఖేదపడుతున్నాను. ముగ్గురు యువకులు, ఇద్దరు నడివయస్కులు అయిన యీ ఐదుగురు వ్యక్తులు యీ విధముగా ప్రాణాలు పోగొట్టుకోవడం సరీయ ప్రధానమంత్రిపై వీరికి వున్న ప్రగాఢమైన గౌరవ ప్రేమలవల్ల, సంభవించనున్న అపాయమును గుర్తించకుండా, అస్థి నిమజ్జన జరుగుచోటును చేరి నీటి అగాధమును లెక్కగొనక ఆకస్మిక మరణమునకు గురి అయినందులకు దేశ ప్రజలందరు మిక్కిలిగా విచారించకతప్పదు. ఎంతో వృద్ధిలోకి రావలసిన వీరు యీవిధముగా దారుణ మరణము పాలవడమువల్ల వారి తలిదండ్రులకు నా హృదయపూర్వక సానుభూతి తెలియ పరుస్తున్నాము. భగవంతుడు వారి ఆత్మకు శాంతిని ప్రసాదించు గాక."

## శ్రీ పి. సి. సుబ్బారెడ్డి కార్యక్రమం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 11: పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ పి. సి. సుబ్బారెడ్డి ఈనెల 13 వ తేదీన నెల్లూరు వెళ్ళుతారు. 17 వ తేదీన హైదరాబాద్‌కు తిరిగివస్తారు. అదేరోజు కారులో నల్గొండకు వెళుతారు. 19 వ తేదీన హైదరాబాద్‌కు తిరిగివస్తారు.

## రాజభవన్ వార్తలు

హైదరాబాదు, జూన్ 10: నిన్న రాజభవన్‌లో గవర్నరు శ్రీ పట్టంథానుపిళ్లైను భారత ప్రభుత్వం పంచవర్ష ప్రణాళిక ప్రచార శాఖ ప్రాంతీయాధికారి శ్రీ పి. ఎస్. వి. రావు, ఆంధ్ర విశ్వ విద్యాలయం సెనేటు సభ్యుడు శ్రీ వి. పురుషోత్తం కలుసుకున్నారు.

## శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య

హైదరాబాద్ జూన్ 11: ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య రేపు ఘంటసాల వెళ్తారు. ఈనెల 14 వ తేదీవరకు అక్కడవుండి 15 వ తేదీన మచిలీపట్నం వెళ్ళుతారు. దే రోజు రాత్రి విజయవాడకు వెళ్లి ఆరాత్రికి అక్కడ వుంటారు. మరుసటిరోజున శ్రీ ఎన్. సిద్దారెడ్డి, శ్రీ బ్రహ్మయ్యగార్లు విజయవాడనుండి హైదరాబాద్ వస్తారు.

## గంటల పంచాంగం

శ్రీ క్రోధి నం॥ జ్యేష్ఠ శు॥ తదియ 1964 సం॥ జూన్ 12 శుక్రవారం శు తదియ రా. 11-25; పునర్వసు రా. 9-39; వర్జ్యం ప 10 52 ల 12-18 కు; వర్జ్యం తె. 5-0 ల శు చవితి జూన్ 13 శనివారం శ చవితి రా 8-43; పుష్యమి రా. 7-43; శేష వ్యం 6-29 కు

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము: తన మనంబునకగు: దా
నొరులకు: నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

శ్రీ క్రోధి సం॥ జ్యేష్ఠ శు॥ తదియ శుక్రవారం

## జాతి విద్వేషం

జాతివిద్వేష నిర్మూలనను, మానవహక్కుల ఉద్ధరణను ఆకాంక్షించి పోరాటంసాగించిన వారిని దేశద్రోహులుగా, విధ్వంసకులుగా పరిగణించి నిర్బంధించి, విచారణకుపెట్టి దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం బాధిస్తున్నది. ఈ నిర్బంధితులలో కొందరికి దక్షిణఆఫ్రికా న్యాయస్థానాలు మరణశిక్షలుకూడా విధించాయి. ఇంకా మరికొంతమందికి కూడా ఇట్టి శిక్షలే విధించడానికి ఆ న్యాయస్థానాలు సిద్ధంగా వున్నాయి. ఈ నిర్బంధాలు, ఈ విచారణలు, ఈ శిక్షలు - ఒక్క ఆఫ్రికా ఖండానికేగాక సకల ప్రపంచానికి ఆందోళన కల్గిస్తున్నాయి. స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, సమానహక్కులు-వీటికోసం అలమటిస్తున్న, వాటికోసం అహరహం కృషిచేస్తున్న ప్రపంచంలో దక్షిణ ఆఫ్రికాలో ప్రవర్తిల్లుతున్న పరిస్థితులు, పరిస్థితులు అనాగరకంగా వుండడమేగాక, చరిత్రగతికి విరుద్ధంగాను, సర్వమానవ ధర్మాలకు వ్యతిరేకంగాను వుంటున్నందువల్ల నాజీ అధర్మాన్ని మించిన ఘోరమైన అధర్మం ఆదేశంలో చెల్లుబడి అవుతున్నందువల్ల, ఏహో కొన్ని రాజ్యాలు తప్ప తక్కిన ప్రపంచమంతా ఆ పరిస్థితుల విపరీత ఫలితాలను ఖండిస్తున్నందువల్ల సమితి ఈ వ్యవహారంలో కల్పించుకోవలసి వచ్చింది; ఇంకా కల్పించుకోవలసివస్తున్నది.

అయితే దక్షిణఆఫ్రికా ఇంతవరకు సమితిచేసిన ఒక్క తీర్మానాన్నికూడా పాటించిన పాపాన పోలేదు. అందువల్ల ఇప్పుడు జాతివిద్వేష వ్యతిరేకుల వ్యవహారాన్ని గూర్చి భద్రతా మండలి ఏకగ్రీవంగా చేసిన తీర్మానాన్నికూడా పాటిస్తుందని అనుకునే ఆస్కారం కన్పించదు. అయినప్పటికీ దక్షిణ ఆఫ్రికాలో జరుగుతున్న ఘోర దురాగతాలేవో ఈ తీర్మానంవల్ల, ఈ తీర్మానంపై జరిగిన చర్చవల్ల ప్రపంచానికి తెలిసిరావడం జరుగుతున్నది. అంతేగాక ప్రపంచరాజ్యాలలో ఏ రాజ్యం ధోరణి ఏమిటో కూడా తెలిసి వస్తున్నది.

దక్షిణ ఆఫ్రికాలో జాతివిద్వేష శాసనాలక్రింద కొనసాగుతున్న విచారణలో నిర్బంధితులను వదలిపెట్టవలసిందని, మరణశిక్షకు గురికానున్న వారిని రక్షించవలసిందని ఇప్పుడు మండలిచేసిన తీర్మానం కోరుతున్నది. జాతివిద్వేషం, శ్వేతజాతీయుల ఆధిక్యము-ఇదే ధర్మం అనుకునే దక్షిణ ఆఫ్రికాకు ఈ తీర్మానం నచ్చకపోవడంలో అర్థం ఉంది, కాని బ్రిటన్ అమెరికాలవంటి ప్రజాస్వామ్య దేశాలు ఈ తీర్మానాన్ని విమర్శించడంలో అర్థం కన్పించదు. ఈ తీర్మానాన్ని చేయడం దక్షిణ ఆఫ్రికా అంతరంగిక వ్యవహారాలలో జోక్యం పెట్టుకోవడం అవుతుందని ఈ రాజ్యాల ప్రతినిధులు వాదించడం చాలా విచిత్రం. ముఖ్యంగా బ్రిటిష్ ప్రతినిధి వాదం పేలవంగా వుంది. ఈ తీర్మానం ద్వారా భద్రతామండలి దక్షిణ ఆఫ్రికాలో న్యాయనిర్వహణ పద్ధతిని విమర్శిస్తున్నది గనుక, అది తమకు నచ్చలేదని ఈ ప్రతినిధి వాదించారు. దక్షిణ ఆఫ్రికాలో న్యాయం ఒకటి వున్నప్పుడు దాన్ని నిర్వహించడం అంటూ వుంటుంది; అక్కడవున్న న్యాయమేది? అల్పసంఖ్యాకులైన శ్వేతజాతిజనం అధిక సంఖ్యాకులపై తమఆధిపత్యాన్ని నెలకొల్పుకుని ఆ ఆధిపత్య సంరక్షణకోసం చేసే ఘోరాలు, అమలుచేసే విపరీత శాసనాలు, వాటిని నిర్వహించడం కోసం అనుసరించే పద్ధతులు ఏవిధంగా చూసినా ధర్మం అనిపించుకోవు; న్యాయం అనిపించుకోవు. అటువంటి సందర్భంలో బ్రిటిష్ ప్రతినిధి న్యాయాన్నిగూర్చి న్యాయనిర్వహణ పద్ధతులను గూర్చి మాట్లాడడం హాస్యాస్పదంగా మాత్రమే కన్పిస్తుంది.

దక్షిణ ఆఫ్రికా అనుసరిస్తున్న ఘోరమార్గాల వాచామాత్రంగా ఖండిస్తే చాలదు. ఆ ఖండించడం ఆచరణలో కన్పించనప్పుడు, కూటనీతిగా కూడా పరిణమిస్తుంది. సర్వ సభ్యతా ప్రపంచంలో దక్షిణ ఆఫ్రికా నల్లనిమచ్చలాగా తయారైంది. ఈ మచ్చను ప్రపంచం సాధ్యమైతే సామమార్గాలవల్ల, సాధ్యం కాకపోతే తదితర మార్గాల వల్ల తుడిచివేసుకోవలసివుంది. ఒక హిట్లర్‌ను, వాణ్ని పెట్టిన ప్రపంచం ఇంకో రూపంలో ఆ హిట్లరిజంను సహించడం అసాధ్యం. ఈ విషయాన్ని బ్రిటన్ వంటి ప్రధాన రాజ్యాలు గ్రహించవలసివుంది; ఇక్కడ స్వార్థానికి తావులేదు.

## సైప్రస్‌కు టర్కీ బెదిరింపులు

### సమితిరాజ్యాలకు మెకారియోస్ విజ్ఞప్తి

నికోషియా, జూన్ 11: సైప్రస్ రిపబ్లిక్‌పై దాడి చేయగలమంటూ టర్కీవారు పదేపదే చేస్తున్న బెదిరింపులు పూర్తిగా నివారణ అయ్యేట్లు తను పలుకుబడినంత ఉపయోగించి పనిచేయవలసిందిగా సైప్రస్ అధ్యక్షుడు మకారియోస్ గత రాత్రి సమితిలో సభ్యత్వం వున్న సర్వ రాజ్యాల నాయకులకు కేబుల్ ద్వారా విజ్ఞప్తి చేశారు.

సైప్రస్‌పైన దండయాత్రకు అనుకూలంగా టర్కీ తన సైనిక నౌకాబలాన్ని, వైమానిక బలాన్ని—సిద్ధంచేస్తూ వుంచుకున్నదని ఆయన అందులో పేర్కొన్నారు.

ఆయన ఇంకా ఇట్లా తెలియజేశారు: సైప్రస్ విభజనకుగాను టర్కీ సైప్రస్ టర్కీ జాతీయులను అనేక విధాలుగా ప్రోత్సహిస్తున్నది. వారికి ఆయుధాలను, మందుగుండు సామగ్రిని సమకూరుస్తున్నది. అంతేగాక తన సైనికులను సైప్రస్ పంపి, తన యీ లక్ష్యాన్ని సాధించడానికి కృషి చేస్తున్నది.

"సైప్రస్ అంతరిక్షాన్ని, సముద్రాన్ని టర్కీ పదేపదే అతిక్రమిస్తున్నది."

టర్కీ యొక్క ఈ దురాగతాలను నానాటికీ భద్రతా మండలి సభ్య రాజ్యాలకు తెలియజేసినట్లు గూడా శ్రీ మకారియోస్ వెల్లడించారు.




# నెహ్రూ: భారతదేశం

స్వర్గీయ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ వ్యక్తిత్వ ఛాయలక్రింద పెరిగినవారు తమభావాలను శ్రీ నెహ్రూ తీర్చిదిద్దారని తెలుసుకోడం బహు కష్టం. ఏ కొద్దిమంది మాత్రమో ఆ విషయాన్ని గుర్తింపగలుగుతారు. ఆయన ప్రేమాభిమానాలను విశేషంగా మూరగొన్నవారు భారతదేశంలోనూ విదేశాలలోనూ లక్షలాదిమంది ఉన్నారు. శ్రీ నెహ్రూసిద్ధాంతాలనూ, విధానాలనూ వారు అత్యంత శ్రద్ధాభక్తులతో అక్షరాలా పాటిస్తున్నారు. ఆయన యుగపురుషుడుగా ఒక తరం వారిని తీర్చిదిద్దారు. మనలో బహు అరుదుగా ఉండే మూడు విశిష్ట లక్షణాలు శ్రీ నెహ్రూలో ఉన్నాయి. మొదటిది ఆయన జ్ఞానపిపాస. జ్ఞానసముపార్జనలో ఆయన ఏ ఒక్క అంశాన్నీ విడిచిపెట్టక పరిపూర్ణత్వాన్ని సాధించవలెనని చెప్పాలి. ప్రజాస్వామ్యవాదులలో ఆయన ఎంతటి శ్రద్ధాసక్తులు కన్పరిచాడో జ్ఞాన సముపార్జనపట్ల అంతటి శ్రద్ధ వహించాడు. చరిత్రకారుని కుండవలసిన అంతర్దృష్టి ఆయనకు అపారంగా ఉంది. చరిత్రలోని ప్రతి సంఘటననూ తరిచి చూచి మానవ ప్రయోజనాలకు అనుగుణమైన విధానాలను రూపొందించారు. ప్రతిదానియొక్క పూర్వాపరాలనూ, భవిష్యత్ చరిత్రను వూహించగల దూరదృష్టి కలవాడు కాబట్టి హీనజాతివారు సైతం గౌరవ మర్యాదలతో జీవించడానికి తగిన వాతావరణాన్ని కల్పించాడు. ప్రతి వ్యక్తిలోనూ నిక్షిప్తమైన శక్తిసామర్థ్యాలను వెలికితెచ్చి, అతని వ్యక్తిత్వం పూర్తిగా వికసింపచేయడమే శ్రీ నెహ్రూ యొక్క ప్రాథమిక లక్ష్యం.

**శ్రీ అశోకమెహతా**

మానవుడు గౌరవంగా బ్రతికేట్లు చూడాలన్న ప్రగాఢ వాంఛ ఆయనలో ఉన్నందునే ఆయన స్వాతంత్ర్యయోధుడు ప్రజాస్వామ్యవాది సోషలిస్టు అయినాడు. మానవజాతి సముద్ధరణకు దాస్యశృంఖలాలను ముందు విచ్ఛిన్నంచేయాలి.

నాయకత్వం సహజంగా ఆయన్నే వరించింది. ఆయన్ను చూచినవారూ, తెలిసినవారూ ఆయన్ను పొగడకుండా ఉండలేరు. మానవులలో భావోద్దీపన కలిగించి వారి హృదయాలూ, మనస్సులూ పూర్తిగా వికసించడానికి ఆయన సహాయపడ్డాడు. ప్రజలపై ఆయనకుగల ప్రభావం పలుకుబడి అమోఘమూ, అపూర్వమూ అయినట్టివి. ఆ పలుకుబడిని ఆయన తన జీవితకాలం చెక్కుచెదరకుండా నిలుపుకోగలిగాడు. ప్రాచీన ప్రవక్తలవలె మానవజాతిని సముద్ధరించి వారి ప్రేమవిశ్వాసాలను శ్రీ నెహ్రూ చూరగొన్నాడుగాని రాజకీయ నాయకులవలె ప్రజలను కించపరచి దౌర్జన్య పద్ధతులద్వారా లోబరుచుకున్నవాడు కాదు. శ్రీ నెహ్రూ సహేతుకతను మనఃపూర్వకంగా అంగీకరించడం ఆయన ఆదర్శాలలో ఒకటి. వంశరాజ్య నిర్మూలనకు ప్రజలలో భావోద్వేగాన్ని ఆయన రెచ్చగొట్టక తప్పనందున ఆ స్థితిలో కూడ వారు క్రమశిక్షణను విడనాడకుండా చేయగలిగిన మహానాయకుడు శ్రీ నెహ్రూ. వారిఉద్యమాన్ని నిరాఘాటంగా కొనసాగించి, స్వాతంత్ర్యం వచ్చినతర్వాత అంతర్జాతీయ బాధ్యతలకు కట్టుబడి వ్యవహరించగలిగిన ప్రజ్ఞాశాలి. జాతి, మతం, భాషలపట్ల ప్రజల పరిమిత విశ్వాసాలను ఆయన గుర్తించడమే గాక గౌరవించారు కూడ. ప్రజల కోర్కెలను పూర్తిగా అర్థం చేసుకున్న నాయకుడు. సంకుచిత భావాలనూ స్వప్రయోజనాలనూ ఆయన నిరసించేవారు.

ప్రాథమిక సూత్రాలను పాటించితీరాలన్న మతం శ్రీ నెహ్రూది. దేశాలన్నీ ఒక వసుధపైన ఒకటే ఆధారపడి ఉన్నాయన్న సూత్రాన్ని గుర్తించికూడా, భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కోరుతూ కాంగ్రెసు సంస్థ తీర్మానం చేయాలని ఆయన పట్టుపట్టారు. ఆచరణలో అనేక సర్దుబాట్లకు అంగీకరించినా ప్రజాస్వామిక సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పాలని కాంగ్రెసుచేత తీర్మానం చేయించారు. పర్వతశిఖరంమీద దివ్వె టికట్లో వెడుతున్న యాత్రికులకు బాట చూపినట్లు లక్ష్యాలను సుస్పష్టంగా నిర్వచించి ప్రజలకు మార్గం చూపాలని ఆయన పట్టుబట్టారు.

ప్రజల సృజనాత్మకశక్తిలో ఆయనకు అచంచల విశ్వాసముంది. ప్రజలపట్లనుంచి ఉత్తేజం పొందే ప్రతిభావంతుడైన కళాకారుడాయన. శ్రీ నెహ్రూ నిజయంసాధించిన విప్లవవాది. స్వాతంత్ర్యోద్యమ నాయకాగ్రణి సామ్యవాది పాతకాలపు దృష్టి అంటే తాదాత్మ్య భావంగల ఆధునికవాది. మానవుడు పరిపూర్ణత సాధించకుండా వ్యవస్థ అడ్డుపడుతుందని ఆయన ఉద్దేశం. ప్రజలలో తాదాత్మ్యం పొంది, వారి కష్టసుఖాలలో పాలు పంచుకొంటూ వారితో సాన్నిహిత్యాన్ని నెరపుకొన్న విశిష్టవ్యక్తి ఆయన.

విధానాలను రూపొందించుకునేందుకు ఆయనకు పార్లమెంటు వేదికగా పనిచేసింది. పార్లమెంటరీ చర్యలతోనే సంతృప్తిపడక, అనేక బహిరంగసభలలో ప్రసంగించి ప్రజలకు కూడా తన భావనా ధోరణులను ఎరుక పరిచేవాడు. ఈ సంపన్న కులీనుడు, పండితుడు, రాజనీతిజ్ఞుడు ఎట్టి అరమరికలూ లేకుండా తన మనస్సులో తిరుగాడుతున్న భావాలను ఏ ఒక్కరితోనూ చెప్పుకొని వూరటచెందక అశేష ప్రజానీకానికే విన్నవించి నిర్ణయాలు చేసేవాడు. ప్రజలకూ ఆయనకూ, మధ్య అవినాభావ సంబంధమే ఉంది.

పార్లమెంటు ప్రాధాన్యంపట్ల ఆయన కెంత విశ్వాసముందో, ప్రణాళికా సంఘం పట్ల ఆయన కంత ఆదరాభిమానాలున్నాయి. జాతి ఆశలకూ, ఆశయాలకూ ప్రణాళికా సంఘం రూపకల్పన చేయాలని ఆయన కోరిక. లక్ష్యాలెంత పవిత్రమైనవో సాధనాలు కూడా అంతే పవిత్రంగా ఉండాలని జాతిపిత మహాత్మాగాంధి వలెనే పండిట్ నెహ్రూ కూడా నమ్మారు.

ఆయన దర్శనం అందరికీ లభించేది. ఆయన సన్నిధిలో ఉద్రిక్తతలు మబ్బు విడిపోయినట్లు తొలగిపోయేవి. ఆయన ముందు ఎంతటివారైనా తమ స్వార్థాన్ని వదులుకుని అధిక సంఖ్యాకుల ప్రయోజనం కోసం పాటుపడతామని శపథం చేసేవారు. ఆయన ప్రభావం అట్టిది. ఆయనలో సంభాషణ అంత మహిమాన్వితమైనట్టిది. వివిధ వర్గాల మధ్య సామరస్యాన్ని సాధించడంలో ఆయనకు ఆయనే సాటి. మత సంబంధమైన అసహనతలపైన లేదా అంతర్జాతీయ అసహనతలపైనా అందుకే ఆయన నిరంతర పోరాటం సాగించారు.

భారతదేశపు ఘనమైన సారస్వత సంపద పట్ల ఆయనకు అపూర్వ గౌరవభావమే ఉంది. కాని బూజుపట్టిన సంప్రదాయాలను పట్టుకు వ్రేలాడడం, ఆయనకు సుతరామూ ఇష్టంలేదు. అందుకే ఆయన యువతా చిహ్నంగా సుమారు డెబ్భై ఏళ్లపాటు నిలబడగలిగారు.

విజ్ఞానశాస్త్రమంటే శ్రీ నెహ్రూకు ఎంతో అభిమానం. సమాజంపై శాస్త్ర సాంకేతిక విజ్ఞానాలు ప్రసరిస్తున్న విప్లవాత్మకమైన ప్రభావాన్ని ఆయన హర్షించారు. దేశంలో దారిద్ర్యాన్నీ కష్టాలనూ రూపుమాపడానికి శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాలను వినియోగింపచేయ ప్రయత్నించారు. దేశంలో నిర్మించబడుతున్న పెద్ద పెద్ద బహుళార్థ సాధక ప్రాజెక్టులు నవయాత్రా కేంద్రాలు కావాలని ఆయన అభిలషించారు. రాజకీయ స్వాతంత్ర్యం, దేశంలో సాంఘిక ఆర్థిక రంగాలలో అభ్యున్నతికి దోహదం చేయాలని అప్పుడే రాజకీయ స్వాతంత్ర్యం సార్థకమవుతుందనీ ఆయన మనసారా నమ్మారు. ఇందుకు దేశంలో సహజ సంపదలను పూర్తిగా వినియోగింప చేయడానికి కృషి చేశారు. ఈ కృషిలో కూడా ఆయన లక్ష్యసాధనకు ఉత్తమ మార్గాలనే అనుసరించారు.

ఆయనకు తన సహచరులలో ఉన్న విశ్వాసం ఆయన ప్రజాస్వామ్యవాదిగా మరింతగా స్థిరపడడానికి దోహదం కల్పించింది. తన ప్రజలకు పూర్వం కంటె ఎక్కువగా విస్తృతాధికారాలు ఇవ్వడానికీ, మరికొన్ని బాధ్యతలు వప్పగించడానికి ఆయన ఏనాడూ వెనుకాడలేదు. అందుకు కారణం ఆయనకు ప్రజలు అయా అధికారాలను సద్వినియోగం చెయ్యగలరన్నీ ఆయా బాధ్యతలను సరిగా నిర్వర్తించగలరనీ పూర్తి విశ్వాసం ఉండడమే. అటువంటి విశ్వాసం కారణంగానే ఆయనకు మతాతీతమైన దృక్పథం ఏర్పడింది. మతం కేవలం మతం మాత్రమే. జీవిత దృక్పథాలన్నా సంస్కృతినీ తీర్చిదిద్దితే ఇక మానవుని విశ్వాసం, విశ్వకవి టాగూరు ఉద్ఘాటించిన "మానవుని ధర్మం" గతి ఏమికాను? అంతర్జాతీయ సామరస్యంతో కూడిన వాతావరణంలోమాత్రమే జాతీయతా భావం వర్ధిల్లుతుంది. అదే విధంగా సరస్పర సహన గౌరవాభిమాన ప్రపూర్ణమైన వాతావరణంలో, మత విశ్వాసము వర్ధిల్లుతుంది. ప్రజలలో మూఢ విశ్వాసాలు తొలగించి, వారికి వ్యక్తిత్వం కల్పించి సామ్యవాదం బోధించి, సంఘ జీవులుగా రూపొందించి వారి శక్తిసామర్థ్యాలను సహకారమార్గంలోకి మళ్లించడానికి శ్రీ నెహ్రూ తీవ్రకృషి చేశారు. తాను నమ్మిన సామ్యవాదానికి ఇవి మూలసిద్ధాంతాలని శ్రీ నెహ్రూ విశ్వాసం.

శ్రీ నెహ్రూ ప్రజలందరినీ గాంధిగా అభిమానించారు. కేవలం పిల్లలను మాత్రమే కాదు తన దగ్గరకు వచ్చిన ప్రతి వ్యక్తినీ ఆయన అభిమానించారు. ఆయనలోని ఆ ప్రేమాభిమానాల మూలంగానే ప్రజలు ఆయనపట్ల ఆకర్షింపబడ్డారు. "అతి సాధారణమైన వీణ కూడా కళాతపస్వియైన వైణికుని చేతిలో గంధర్వగానమే వినిపిస్తుంది." అదేవిధంగా అతి సామాన్యుడు కూడా శ్రీ నెహ్రూ ప్రభావంలో పడినప్పుడు ఉత్తమ మానవుడుగా రూపొందడం, అతనిలో అంకురమాత్రంగా ఉన్న సృజనాత్మకశక్తికి ఒక మహోదాత్తరూపం అబ్బడం జరిగింది.




## నెహ్రూ ముద్రతో తపాలా బిళ్ల

### దేశమంతటా విడుదల

న్యూఢిల్లీ, జూన్ 10: జూన్ 12న నెహ్రూ స్టాంపును ప్రధాని శ్రీ శాస్త్రి విడుదల చేస్తారు. ఈ విడుదల సందర్భంగా అఖిల భారత రేడియో ఆడిటోరియంలో ఉత్సవం జరుగుతుంది. అక్కడే ఈ స్టాంపు విడుదల చేయబడుతుంది.

లక్షజనంతో శ్రీనెహ్రూ వున్నట్లు ఈ స్టాంపుమీద బొమ్మ వుంటుంది.

ఇందులో మొదటి స్టాంపును న్యాయ మంత్రిగా శ్రీ అశోకసేన్ ప్రధానమంత్రికి అమ్ముతారు.

ఈ విడుదలకు సంబంధించి అలహాబాదు, బొంబాయి, కలకత్తా, మద్రాసులలో తపాలాశాఖవారు ప్రత్యేక ఉత్సవాలుజరుపుతారు రాష్ట్ర గవర్నర్లో, ముఖ్యమంత్రులో, అక్కడ ఈ స్టాంపులను విడుదల చేస్తారు.

ఈ స్టాంపు గోధుమరంగుగావుంటుంది. దేశంలో ఈ స్టాంపులకు వుండేగిరాకీని దృష్ట్యాట్టుకోడానికి నాను దాదాపు 20 మిలియన్ స్టాంపుల తయారు చేశారు.

## రాజమండ్రివద్ద గోదావరికి రెండవ రైలు వంతెన

### నాల్గవ ప్రణాళికలో నిర్మాణం సంభవమటు: కేంద్ర ఆర్థికమంత్రి వివరణ

కర్నూలు జూన్ 11: గోదావరినదికి రాజమండివద్ద రెండవ రైలువంతెన నిర్మాణ పథకం నాల్గవ పంచవర్ష ప్రణాళికలో అమలు చేయబడవని ఆర్థికమంత్రి శ్రీ టి.టి. కృష్ణమాచారిగారు పార్లమెంటు సభ్యుడు శ్రీ పి. వెంకటసుబ్బయ్యగారికి వ్రాసినలేఖలో వివరించారు.

విజయవాడ—వాల్తేరు జంట రైలుమార్గ నిర్మాణపథకంలో రాజమండ్రివద్ద గోదావరికి రెండవ రైలువంతెన అనేది అంతర్భాగంగ వుండదనికూడా ఆర్థికమంత్రి వివరించారు.

ఆంధ్రప్రదేశ్ పార్లమెంటు సభ్యులు సమర్పించిన నివేదికకు సమాధానంగా కేంద్రఆర్థికమంత్రి ఈ లేఖ వ్రాశారు. ఆయన ఈలేఖలో ఇంకా కిందివివరాలు తెలియజేశారు.

మద్రాసు-కలకత్తా జాతీయరహదారి తూర్పుగోదావరిజిల్లా డెల్టా ప్రాంతంమీదుగ వేయడానికి ఇప్పటికే కేంద్రప్రభుత్వం పెద్ద మొత్తాన్ని వ్యయపరచివున్నందున, ఈ విషయంలో ఇంకా ఖర్చుకు అంగీకరించడం సాధ్యం కాబోదు. రాజమండ్రివద్ద రైలు-రోడ్డు నిర్మాణానికి కాగల రెండుకోట్లరూపాయల ఖర్చులోను సగం భరించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అంగీకరించినప్పటికీ, రాష్ట్రప్రభుత్వం వాటాను భరించేయడానికి కేంద్రప్రభుత్వం తగినంత హెచ్చు ఆర్థికసహాయం చేయవలసివుంటుందనే విషయాన్నికూడా శ్రీకృష్ణమాచారిగారు తమ లేఖలో ఉదాహరించారు.

## టిబెటన్ శరణార్థుల వైద్య అవసరాలు

### పశ్చిమజర్మనీ ప్రభుత్వంచే 'అంబులెన్స్' బహూకృతి

మద్రాసు, జూన్ 11: ఒరిస్సాలోని టిబెటన్ శరణార్థుల ఉపయోగార్థం పశ్చిమ జర్మనీ ప్రభుత్వం పంపిన ఒక అంబులెన్స్ శకటాన్ని, మద్రాసులోని పశ్చిమ జర్మనీ కాన్సల్ డా. జె. హాలెక్ నిన్న సాయంత్రం, మదరాసు హార్బరులో, కేంద్ర సహాయ సంఘానికి బహూకరించారు.

సహాయసంఘం తరఫున యీ శకటాన్ని భారత విదేశాంగ వ్యవహారాలశాఖ ఉద్యోగి శ్రీ పి. కె. మహంతి స్వీకరించారు శ్రీ మహంతి, యీ సంఘం ప్రత్యేకోద్యోగిగా పనిచేస్తున్నారు.

ఈ సందర్భంలో హార్బర్‌వద్ద ఏర్పాటైన పత్రికా విలేఖరుల గోష్ఠిలో డా. హాలెక్ మాట్లాడుతూ, యీ అంబులెన్స్ శకటం విలువ సుమారు 15 వేలవరకు ఉంటుందన్నారు. భారతదేశంలోని టిబెటన్ శరణార్థుల ఉపయోగార్థం, ప్రపంచంలోని కమ్యూనిస్టేతర దేశాలు యీ విధమైన సహాయచర్యలు నిర్వహిస్తున్నాయనీ తమ ప్రభుత్వం పంపిన యీ అంబులెన్స్ శకటాన్ని సహాయసంఘానికి బహూకరించినందుకు తాను ఆనందిస్తున్నాననీ తెలిపారు.

శ్రీ మహంతి మర్యాదగా చేసిన తన ప్రసంగంలో యీ అంబులెన్సు శకటాన్ని పంపిన పశ్చిమ జర్మనీ ప్రభుత్వానికి కృతజ్ఞత తెలియజేశారు.

ఈ శకటాన్ని ఒరిస్సాలో పునరావాస వసతులు కల్పించబడిన టిబెటన్ శరణార్థులకు మాత్రం ఉపయోగించటం జరుగుతుందన్నారు. ఇలాంటి శిబిరాలు, యింకా మైసూర్ మధ్యప్రదేశ్, సిక్కిం పేరిట ఏడెనిమిది ప్రదేశాల్లో నిర్వహింపబడుతున్నాయన్నారు. ఈ శకటాన్ని రేపు ఒరిస్సాకు తీసుకు పోదలచామని శ్రీ మహంతి చెప్పారు.

ఈ అంబులెన్సులో రెండు స్ట్రెచర్లు, టార్చిలైట్లు ప్రథమ చికిత్సా పరికరాలు కొన్ని ఔషధాలు ఉన్నాయి.

## భారత్‌కు రష్యా ట్యాంకులు

మాస్కో, జూన్ 10: రష్యానుంచి భారత్‌కు ట్యాంకులు ఎగుమతి కావడానికి సిద్ధంగా వున్నాయి. వీటిని మిన్‌స్కో మోటార్ కర్మాగారంలో నిర్మించారు. భారతదేశం వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా ఈ ట్యాంకులు నిర్మించబడినాయి.

## సమితుల ఎన్నికలు

### నెల్లూరుజిల్లాలో

(స్వకీయ విలేఖరి)

నెల్లూరు, జూన్ 10: నెల్లూరుజిల్లాలో పంచాయితీ సమితుల ఎన్నికలు ఈ నెల 19, 22, 24 తేదీలలో మూడు దశలలో జరుగుతాయి.

మొదటి దశలో నామినేషనులు 12 వ తేదీ, ఉపసంహరణలు 18 వ తేదీ. ఎన్నిక 19 వ తేదీ. ఆత్మకూరు, కావలి, వెలిగండ్ల, కోట, పొదిలి, వెంకటగిరి, కోవూరు, ఇందుకూరుపేట, రాపూరు సమితులు.

రెండవ దశలో నామినేషనులు 16 వ తేదీ; ఉపసంహరణలు 20 వ తేదీ. ఎన్నికలు 22వ తేదీ. రాపూరు, బుచ్చిరెడ్డిపాలెం, ఉలవపాడు, గూడూరు, కనిగిరి, పొదలకూరు ఏంజమూరు సమితులలో.

మూడవ దశలో నామినేషనులు 18 వ తేదీ. ఉపసంహరణలు 22 వ తేదీ. ఎన్నికలు 24 వ తేదీ. వెంకటాచలం, ఉదయగిరి, కొండపి, సూళ్ళూరుపేట, తాళ్ళూరు సమితులలో.

## 10 జనపథ్

న్యూఢిల్లీ, జూన 10: ప్రధాని శ్రీ శాస్త్రి ఇకనుంచి 10, జనపథ్‌లో నివసిస్తారు. ఆ గృహం ప్రధాని అధికార గృహంగా పరిగణించబడుతుందని తెలుస్తున్నది. ఈ గృహం ప్రస్తుతం శాస్త్రి నివసిస్తున్న ఇంటికి సమీపంలో వుంది. అందులో ఇప్పుడు న్యూజిలాండ్ హైకమిషనర్ వుంటున్నారు. ఆయన దాన్ని ఖాళీ చేయడానికి అంగీకరించారు.

శ్రీ శాస్త్రి ఇప్పుడు తాను వుంటున్న ఇంటిని కూడా తనక్రిందే వుంచుకుంటారు. తీన్ మూర్తివద్ద ప్రధానిగా శ్రీ నెహ్రూ నివసించి వున్న గృహాన్ని జాతీయ స్మారక చిహ్నంగా వుంచబోతున్నదీ. లేనిదీ ఇంకా తెలియరావడంలేదు. అయితే విదేశాంగశాఖలో శ్రీ నెహ్రూ వాడిన కుర్చీ, దస్త్రాలు, జాతీయచిహ్నంగా భద్రపరచబడగలవని తెలియవస్తున్నది.

## కడపవద్ద గూడ్సు రైలుకు ప్రమాదం

### మూడు వ్యాగనులు పట్టాలు తప్పినవైనం

కడప, జూన్ 9: మద్రాసు వెడుతున్న గూడ్సురైలు (1840 డౌన్ స్పెషల్)లో మూడు వ్యాగనులు కృష్ణాపురం (కడప ప్రక్కస్టేషను)వద్ద గత రాత్రి పట్టాలు తప్పినవి. కడపమీదుగా రైళ్ళ రాకపోకలకు అంతరాయం ఏర్పడింది. అయితే వేటి ఉదయానికి వీటిని తొలగించి మామూలు రాకపోకలు సాగింపజేశారు. ఇంతవరకు మెయిల్, జనతా ఎక్స్‌ప్రెస్ బండ్లు ఆలస్యంగా నడిచాయి.

న్యూయార్క్, జూన్ 11: అమెరికాలో ఈ ఏడాది ఉక్కు ఉత్పత్తి, 117,000 000 టన్నులు. 1955 లో మాత్రమే ఇంతగా ఉత్పత్తి జరిగింది.

# లేఖలు

## పంచాయతీ ఎన్నికలతీరు

అయ్యా!

పంచాయితీ ఎన్నికల ప్రచారం రెండు మాసాల పాటు ఉధృతంగా సాగిన పిమ్మట ఇటీవలనే అంతం కావడంతో పల్లెసీమల వాతావరణం వర్షము వచ్చి వెలిసిన విధంగా ఉన్నది. ఆబాలగోపాలం అభ్యర్థులు విద్రోహ రములు పనిపెట్టు వటి ఓటర్ల అభిమానాన్ని చూరగొనటానికి పడ యుపాయాలనలు వర్ణనాతీతము. మహనేత అయిన నెహ్రూ పరమపదించడంతో యావద్భారత దేశము దుఃఖసాగరములో మునిగి యుండగా లంధలో గంట గడియారాల నినాదాంతో పోలీసుల గస్తీలలో ప్రేమాభిమానాలు ఉట్టిపడే అభ్యర్థుల అభ్యర్థనలతో గ్రామాలు కిటకిట లాడినవి. పంచాయితీ ఎన్నికలలో ప్రప్రథమంగా రహస్య ఓటింగు పద్ధతి ప్రవేశపెట్టడం వలన ఓటర్ల నాడిమాట అభ్యర్థులకు అంతు చిక్కకుండా పోయినవి. ధన ధాన్యరాసులు ఘడియలలో మాయ అంతర్ధానం కావడం అందరిని ఆశ్చర్యచకితులను గావించినది. పనుగాడ్పులు వర్షాభావము బహుశా పెన్సెంటుమందినను ప్రజలలో ఉత్సాహము వ్యక్తమైనది. తంతా ముగిసిన తదనంతరం అభ్యర్థుల ఆశలు నిరాశకావడంతో ఆవేశాలు పెచ్చు పెరిగి అనేక అమానుష కృత్యాలకు దారితీసినది. ప్రియతమ నాయకుని ఆత్మశాంతికి ప్రపంచమంతటా సంతాప సభలు సమావేశాలు ప్రార్థనలు జరుపుతూ, శ్రద్ధాంజలి ఘటించుచుండగా మన ప్రాంతాలలో తుపాకి గుండ్ల ప్రతిధ్వనులు, దండనీతి దౌర్జన్య కాండలు, అధికార్లపై చేయి చేసుకొనడం లాంటి నిషిద్ధ సంఘటనలు వినవచ్చినవి. ఇది మొత్తం జాతికే అవమానకరము. ఇందుకు కారణం? రాజ్యాంగం ప్రసాదించిన వయోజన వోటు హక్కును వినియోగించుటకు ఉండవలసిన విచక్షణా జ్ఞానము అత్యధిక సంఖ్యాకుల్లో మృగ్యమగుటయే! వ్యక్తిగత ద్వేషాలు, సంకుచిత తత్వ భావాలు, పర్వ వైషమ్యాలు విస్తృతంగా ప్రభలియుండుట, కూడా మరొక కారణం. దేశంలో విద్యావంతుల శాతం అభివృద్ధి యగునంతవరకు, హక్కులు విధి బాధ్యతలను గుర్తెరుగు వరకు ఇది అనివార్యము. ఈ సంఘటనలు పునరావృత్తి కాకుండుటకు ప్రభుత్వం తగు చర్య గైకొనవలెను.

(తెనాలి) ఉల్లాసి సుబ్రహ్మణ్యం

## టెలిగ్రామ్ ఫారాలు

అయ్యా!

ప్రస్తుతం వాడకంలో ఉంటున్న టెలిగ్రామ్ ఫారాలలో ఒకు వాటిని అందజేసే ఆఫీసు వారికి ఇటు అందించే ప్రజానీకానికి, అయా అంశాలకు సంబంధించే అనేక వివరాలను పొందుపరచుకోగల అవకాశాలు ఉండటం ఆనందించ దగ్గ విషయం. అదే వాటిలో తంతి పంపించే వారి చిరునామాను వ్రాయుటానికి కేటాయించబడిన స్థలం సంపూర్ణంగా, విపులంగా వ్రాయటానికి చాలటంలేదు. ఆ స్థలం నిడివి వెడల్పులు పెంచటమే గాక, వాటి దిగువ సమాచార వ్రాయుటాని కుద్దేశింప బడిన రేఖా మధ్య స్థలాన్ని అధికం చేయటమూ ఎంతో అవసరం.

ఇక, ఒక వ్యక్తి సాయంత్రం వేళ (తంతి ఆఫీసు పని చేయుకాలంలోనే) వెళ్ళి బెంగుళూరుకో టెలిగ్రామ్ ఇవ్వబోతే అది ఆ రోజే బెంగుళూరు చేరటానికి వీలు (కనెక్షన్) ఉండకపోతే, ఆ వ్యక్తి నుండి టెలిగ్రామ్ తీసుకొని దానిని మరుసటి రోజు ఉదయం "బుక్" చేయవచ్చుకానీ, "బెంగుళూరుకు కనెక్షన్ లేదు కనుక (సాధ్యంకాదు)" అని ఖచ్చితంగా తప్పించుకోవటం లాంటి పద్ధతులు ప్రజలకు ప్రయాసను కలిగించవచ్చు. కనుక ఎన్ని లేని విషయాలు ఆ తంతులిచ్చే వారికి తెలిపి మరుసటి రోజు బుక్ చేయటానికి ఇష్టపడినట్లైతే, ఆ టెలిగ్రాములను ఆఫీసులో అప్పుడే తీసిపెట్టుకోవటంతో ఎవరికీ ఎట్టంటి ఇబ్బందులూ ఉండవనటం అటుంచి, ఈ మార్పులు అమలు జరిగే పక్షంలో అశేష ప్రజానీకానికి అత్యధికులు అమూల్యమైన సేవ చేస్తున్న తంతి తపాలా శాఖ పరపతి మరింత పెరగగలదని నా ప్రగాఢ విశ్వాసం.

(గుంతకల్లు) పరిటేపల్లి లక్ష్మీనారాయణ.

## నెహ్రూ చిత్రపటం ఊరేగింపు

### రామ్‌నగర్‌లో అభ్యంతరం: 22 మంది ముస్లిముల అరెస్టు

(స్వకీయ విలేఖరి)

బెంగుళూరు, జూన్ 10: సోమవారం నాడు, జాతీయ సంతాపదినం సందర్భంలో ప్రధాని శ్రీ నెహ్రూ చిత్రపటంతో వెడుతున్న ఊరేగింపుకు అభ్యంతరం చెప్పినందుకుగాను ఇక్కడకు 30 మైళ్ళ దూరంలోవున్న రామ్‌నగర్‌లో 22 మంది ముస్లిములను పోలీసులు అరెస్టు చేశారు.

ఈ ఊరేగింపు వెడుతున్న సిధిలో మసీదు వుంది. దానివద్ద శోకగీతాలపాలకు కొందరు ముస్లిములు అడ్డు చెప్పారు: ఎవ్వరో కొందరు ఇలా ఈ ఊరేగింపు జరపవన్ని స్థానిక కాంగ్రెసువాదులు కొందరు నిరసించారనికూడా అక్కడికి వెళ్లివచ్చిన బెంగుళూరు డి. ఐ. జి. శ్రీ క్వాదిర్ ఆలీ చెప్పారు. ప్రభుత్వ కొరకు ఈ 22 మంది ముస్లిములను ఆయన కస్టడీలోకి తీసుకున్నారు.

## శ్రీరామ మహోత్సవం

మద్రాసు జూన్ 11: విశ్వకళా...(ఇల)... ఆధ్వర్యాన ...13 న తేదీనుండి శ్రీరామ మహోత్సవం జరుగుతుంది. జూలై 7 వ తేదీ ఉదయం 11 గంటలకు శ్రీరామ మహోత్సవం సంపూర్తిగా జరుగుతుంది.

హెన్రీ ★ కార్ల్ ఆండర్సన్



# ఇతర అధ్యాపకుల స్థాయికి తెలుగుపండితులహోదా పెంపు

## రాష్ట్రప్రభుత్వ నిర్ణయం : ముఖ్యమంత్రి వివరణ

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 10: రాష్ట్రంలోని విద్యాసంస్థలలో ఆర్ట్సు లేదా సైన్సు టీచర్లతో సమానంగా తెలుగు పండితుల, ప్రాచ్య విద్యావ్రతులు (ఓరియంటల్ టైటిల్స్)గలవారి హోదాను పెంచేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నిర్ణయించింది.

నేడు సచివాలయంలో జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి పై విషయాన్ని ప్రకటించారు.

ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ఇలా చెప్పారు: "రాష్ట్రంలో తెలుగు ప్రజల భాష. తెలుగు హెచ్చు స్థాయిలో వినియోగించేట్లు తెలుగుభాషను అభివృద్ధిపరచే విషయమై తీవ్రంగా ఆలోచిస్తూవచ్చాము. పరిపాలనా భాషగా తెలుగును ప్రవేశపెట్టేందుకు అధికారస్థాయిలో కొన్ని చర్యలు తీసుకొనబడుతున్నవి. అయినప్పటికీ సహజంగా తెలుగు ప్రముఖస్థానము నాక్రమించుకోవాలంటే ఇంకా గట్టి, తీవ్రమైన చర్యలు తీసుకోవలసి వుంటుందని భావించాను. ఈ దృష్ట్యా, ప్రాచ్యవిద్యార్హతలు (ఓరియంటల్ లాంగ్వేజి టైటిల్స్) గలవారికి జీతాలను సైన్సు లేదా ఇంగ్లీషుటీచర్లు పొందుతున్న జీతాలలో సమానంగా పెంచేందుకు ప్రభుత్వం నిర్ణయించింది. ఇందువల్ల ముందుకొచ్చి, తెలుగు అధ్యాపకులుగా పనిచేసేందుకు చాలామంది ఆకర్షింపబడుతారు. ఈ విషయమై ప్రభుత్వ ఉత్తర్వులు త్వరలో జారీచేయబడుతవి.

ప్రాచ్యభాషాధ్యాయనము, చేబట్టిన ఉపాధ్యాయులకు 'స్టైఫండ్సు'ను యిచ్చే విషయమై కూడా ప్రభుత్వము ఆలోచిస్తున్నది. ఈరెండు చర్యలు తెలుగు భాషాభివృద్ధికిదోహదం చేస్తాయని ఆశిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ తెలుగు రాష్ట్రము గనుక తెలుగు భాషాభివృద్ధికి సాధ్యమైన చర్యలన్నీ తీసుకోవాలి; ప్రస్తుతమున్న స్థితినుండితెలుగు భాషను ఉన్నత స్థాయికి తేవాలి."

పత్రికా విలేకరుల ప్రశ్నలకు సమాధానమిస్తూ, మహాభారతము లాంటి కావ్యాలు సామాన్య ప్రజలకుకూడా అందుబాటులో వుండేట్లుగా, చౌక ధరలకు లభ్యమయ్యేటుగా అచ్చు వేయించాలన్న సూచనను సుముఖభావముతో పరిశీలిస్తామని ముఖ్యమంత్రి హామీ యిచ్చారు. ప్రభుత్వము తీసుకున్న పై నిర్ణయానికి-తెలుగు భాషాభిమానులు, టీచర్లు, విద్యావేత్తలతో సహా అన్ని తరగతుల ప్రజలు హర్షిస్తున్నారు.

### సంజీవరెడ్డి లోక్ సభకు పోటీచేయాలి

#### బ్రహ్మానందరెడ్డి సూచన

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, జూన్ 10: కేంద్ర ఉక్కుగనుల మంత్రిగా నియమింపబడిన శ్రీ నీలం సంజీవరెడ్డి లోక్‌సభ స్థానానికి పోటీ చేయటం మంచిదని ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అభిప్రాయపడుతున్నారు.

ఆయన రాజ్యసభకు పోటీచేసేపక్షంలో అందుకు వీలుగా తమ స్థానాలను విడిచిపెట్టడానికి సిద్ధంగా ఉన్న కాంగ్రెసు సభ్యులు రాజ్యసభలో అనేకులు ఉన్నారని ముఖ్యమంత్రి తెలిపారు. అయితే శ్రీ సంజీవరెడ్డి ఆదిలాబాదు పార్లమెంటరీ నియోజకవర్గంనుండి లోక్‌సభస్థానానికి పోటీచేయవచ్చునని తాను భావిస్తున్నామని ఆయన చెప్పారు. ఈ నియోజకవర్గంనుండి లోక్‌సభకు ఎన్నికైన ప్రస్తుత సభ్యుడు శ్రీ కె. నారాయణరెడ్డిని తర్వాత రాష్ట్ర శాసన పరిషత్తు సభ్యునిగా చేయవచ్చునని ముఖ్యమంత్రి సూచించారు.

శ్రీ సంజీవరెడ్డి లోక్‌సభకు పోటీచేసేదీ లేక రాజ్యసభకు పోటీచేసేదీ ఆయన జూన్ 18 వ తేదీన ఇక్కడకు వచ్చిన తర్వాత మాత్రమే నిర్ణయింపబడుతుంది.

### సంజీవరెడ్డి నియామకం ఆంధ్రకు సత్కారం

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాదు, జూన్ 10: శ్రీ నీలం సంజీవరెడ్డిని కేంద్ర మంత్రివర్గంలో నియమించటాన్ని గూర్చి వ్యాఖ్యానిస్తూ ఆంధ్రప్రదేశ్ రెవిన్యూ మంత్రి శ్రీ నూకల రామచంద్రారెడ్డి ఇలా అన్నారు:—

"దేశ సౌభాగ్యాన్ని రూపొందించే గురుతర కార్యభారంలో ఆంధ్రమాత యొక్క మరొక పుత్రునికి వాటా యివ్వటం మిక్కిలి సంతోషాన్ని కలిగిస్తున్నది. ఎప్పటికన్న కూడా ప్రస్తుత సమయంలో దేశానికి శ్రీ సంజీవరెడ్డి వంటి సమర్థుల సేవలు ఎక్కువగా అవసరం. ఆయనను కేంద్ర మంత్రివర్గంలో చేర్చుకోవటం ఆంధ్రప్రదేశ్‌ను గౌరవించటం. దేశానికి సేవ చేయుటానికి ఆయనకు పరమేశ్వరుడు తగు శక్తిని ప్రసాదించాలని ప్రార్థించుదాం."



పదవీస్వీకారానంతరం రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్‌తో ప్రధాని శ్రీ శాస్త్రి, ఇతర మంత్రులు, సహాయమంత్రులు కలిసి తీయించుకున్న ఛాయాచిత్రం.

### విశ్వవిద్యాలయాల పరీక్షా ప్రమాణాలు

#### సుందరయ్య సంఘం త్వరలో రద్దుఅయ్యే సూచన

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 10: రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాల పరీక్షా ప్రమాణాల సమస్యను పరిశీలించటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇటీవల నియమించిన సంఘం త్వరలో రద్దుకావింపబడవచ్చును. ఈ సంఘానికి శ్రీ పి. సుందరయ్య అధ్యక్షుడు. శాసనసభ సభ్యులు, శాసనపరిషత్తు సభ్యులు, విశ్వవిద్యాలయ ప్రతినిధులు ఇందులో ఉన్నారు.

భారతప్రభుత్వం దేశ విశ్వవిద్యాలయాల విద్యా ప్రమాణాల సమస్యను పరిశీలించటానికి నిపుణులతో కూడిన ఉన్నతాధికార సంఘాన్ని నియమించిన దృష్ట్యా సంఘం నివేదిక వచ్చేంతవరకు ఆగటం మంచిదని భావిస్తున్నట్లు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నేడు పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ చెప్పారు. ఇందువల్ల సుందరయ్య సంఘం తన పనిని ఆపాలని నిర్ణయించినట్లు ఆయన చెప్పారు.

ప్రస్తుత సూచనల ననుసరించి ఈ సంఘం బహుశా త్వరలో రద్దు కావింపబడ వచ్చునని తెలుస్తున్నది.

# పవిత్రనదులలో నెహ్రూ చితాభస్మ నిమజ్జనం

## ఆంధ్రప్రదేశ్ ప్రజల శ్రద్ధాంజలి

కర్నూలు, జూన్ 10: ఇక్కడ తుంగభద్ర, హంద్రీ నదులు కలిసేచోట మంత్రి డా. ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, పెన్నార దగ్గర పవిత్ర పినాకిని (పెన్నానది)లో మంత్రి శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి, రాజమండ్రివద్ద గోదావరిలో మంత్రులు శ్రీ తోట రామస్వామి, శ్రీ పి. వి. నరసింహారావుగార్లు మొన్న ఉదయము స్వర్గీయ నెహ్రూ చితాభస్మము కలిపారు.

ఈ మూడుచోట్ల ప్రజలు — ఆబాలగోపాలము—నెహ్రూ చితాభస్మ పాత్రపై పుష్ప వర్షం కురిపించి, అశ్రుతర్పణ మర్పించి, "నెహ్రూ జిందాబాద్" అంటూ ఘోషించి, తమప్రియతమ నాయకునికి జోహారు లర్పించారు; భక్త్యంజలి ఘటించారు.

### తుంగభద్ర, హంద్రీ సంగమములో

కర్నూలునుండి "ఆంధ్రపత్రిక" ప్రత్యేక ప్రతినిధి ఇలా వ్రాస్తున్నారు:

మొన్న ఉదయము పంచాయతీరాజ్ శాఖ మంత్రి డా. ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య స్వర్గీయ శ్రీ నెహ్రూ చితాభస్మమును ఇక్కడ తుంగభద్ర, హంద్రీనదులు కలిసేచోట నిమజ్జనము జరుపడాన్ని దాదాపు 50 వేలమంది—అన్ని కులాలకు, మతాలకు చెందిన స్త్రీలు, పురుషులు, పిల్లలు తిలకించారు. పలువురు దుఃఖించగా, వేలాదిమంది 'నెహ్రూ జిందాబాద్' అంటూ నినాదాలు చేశారు.

ఇంతమంది ఒకచోట కూడటము కర్నూలు చరిత్రలోఅపూర్వము. నెహ్రూ చితాభస్మమును నిమజ్జనము చేయడము చూచిన కొందరుస్త్రీలు ఏడ్చేశారు. సరిగ్గా ఉదయం 11 గం॥ లకు, ప్రభుత్వ అతిథి గృహమునుండి బయలుదేరిన నెహ్రూచితాభస్మపాత్ర ఊరేగింపు తుంగభద్రా హంద్రీనదులు కలిసేచోటుకు చేరుకున్నది. వేదమంత్రాలు చెప్పబడుతుండగా మంత్రి డా॥ లక్ష్మీనరసయ్య శ్రీ నెహ్రూ చితాభస్మమును సంగమంలో కలిపారు. అంతకుముందు పోలీసుబ్యాండు దళమువారు జాతీయగీతాన్ని ఆలాపించారు. నెహ్రూ పట్ల గౌరవ సూచకంగా పోలీసులు మూడుసార్లు తుపాకులు ప్రేల్చారు. మంత్రి శ్రీ లక్ష్మీనరసయ్య దుఃఖవదనముతో నెహ్రూ చితాభస్మపాత్రను ఒడ్డునుండి రెండు నదులు కలిసేచోటికి తీసుకుపోయి, అక్కడ చితాభస్మమును నీటిలో కలిపారు.

అంతకుముందు, చక్కగా అలంకరించిన జీపుపై చితాభస్మ పాత్రను ఊరేగింపుగా తెస్తుండగా, మెయిన్ బజారులో స్త్రీలు, పిల్లలు చితాభస్మ పాత్రపై పూల వర్షం కురిపించారు. చాలామంది స్త్రీలు తమ పిల్లలతో 'చితాభస్మ పాత్ర' కు నమస్కారము చేయించారు. ఊరేగింపు ప్రారంభ సమయంలో, అతిథి గృహంవద్ద చితాభస్మ పాత్రపై మంత్రి శ్రీ లక్ష్మీనరసయ్య, డిప్యూటీ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ బి. ఎన్. కల్యాణరావు, కలెక్టరు శ్రీ ఎస్. ఎ. ఖాదర్, పోలీసు సూపరింటెండెంటు శ్రీ ఎల్. జె. విక్టర్, మేజర్ సి. ఆర్. రెడ్డి గార్లు పుష్పమాల లుంచారు. జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ మద్దూరి సుబ్బారెడ్డి, పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ పాలాది రామయ్య, శ్రీ డి. వి. సుబ్బాశాస్త్రి, శ్రీ నివర్తి వెంకట సుబ్బయ్య, శ్రీ కె. హెచ్. వెంకటశెట్టి, శ్రీ పి. వెంకటకృష్ణారెడ్డి, శ్రీ ఎం. లక్ష్మీకాంతారెడ్డి, జిల్లా పరిషత్ ఉపాధ్యక్షుడు శ్రీ బి. ఎన్. రామకృష్ణారెడ్డి, తదితర స్థానిక ప్రముఖులు ఊరేగింపులో పాల్గొన్నారు. ఊరేగింపు ప్రారంభమైనప్పుడు ఒక వృద్ధ స్త్రీ నెహ్రూ చితాభస్మ పాత్రను ఉంచిన జీపు దగ్గరికి పోవడానికి ప్రయత్నించగా ఆమెను పోలీసులు ఆపగా, "నెహ్రూ బ్రతికి ఉండగా ఆయన దగ్గరగ పోయేందుకు మీరు మమ్ములను అనుమతించలేదు. కనీసము యిప్పుడు ఆయన చితాభస్మమునైనా దర్శనము చేసుకోనివ్వండి" అని గట్టిగా ఆమె అరిచింది. ఆంధ్రరాష్ట్రానికి ప్రారంభోత్సవము నెహ్రూ ఇక్కడే చేశారు గనుక, తగినట్లుగా ఒక నెహ్రూ స్మారక చిహ్నమును కర్నూలులో కట్టించాలని ప్రతిపాదించబడినది. శ్రీశైల జల విద్యుత్ ప్రాజెక్టుకు శ్రీ నెహ్రూ శంకుస్థాపన చేసిన విషయాన్ని కర్నూలు ప్రజలు గర్వకారణంగా జ్ఞాపకముంచుకుంటారు.

### గోదావరిలో

రాజమండ్రి, జూన్ 10: రాష్ట్ర మంత్రులు శ్రీ తోట రామస్వామి, శ్రీ పాములపర్తి వెంకట నరసింహారావుగార్లు నెహ్రూ చితాభస్మ నిక్షిప్త పాత్రను ఊరేగింపుగా తీసుకవెళ్లి పవిత్ర గోదావరిలో నిమజ్జనం జరిపారు. ఎండలో నిలిచిన వేలమంది శ్రద్ధాంజలి సమర్పించారు.

మంత్రులిద్దరు స్నానము చేసి, నూతన వస్త్రములతో కర్మననుష్ఠించారు. నగరవైదిక సభాపతి శ్రీ తెలికచర్ల రఘునాథ కృష్ణమూర్తి, శ్రీ ప్రయాగ కృష్ణమూర్తిగార్లు స్మార్త కర్మల కర్తృత్వం వహించారు.

అస్థినిమజ్జన కార్యక్రమమును ఆలిండియా రేడియో (విజయవాడ) కేంద్రంవారి తరుపున శ్రీ ప్రయాగ నరసింహ శాస్త్రి; శ్రీ క్రొవ్విడి లింగరాజు సమీక్షించారు.

సుబ్రహ్మణ్యం మైదానంలో కలెక్టరు డా॥ రావ్ కె వేపా అధ్యక్షతన జరిగిన బహిరంగ సభకు 10 వేలమంది హాజరయినారు. శ్రీ॥ శ్రీ॥ ప్రధానికి కలెక్టరు జోహారులర్పించారు. విక్టోరియా స్కూలు బాలికలు 'వందేమాతరం' గీతాలాపన చేశారు. సాధుజనాభాయి గీతనుండి కొన్ని శ్లోకాలను, కురాన్ నుండి శ్రీ కాజా అనదుల్లాఖాన్, బైబిల్‌నుండి రెవరెండు విజయరత్నం, గ్రంథ్ సాహెబ్ నుండి సర్దార్ గురుముఖ్‌సింగ్ కొన్ని ప్రవచనాలను చదివారు. ఆ తరువాత, చైనా దురాక్రమణను గురించి నెహ్రూ చేసిన ప్రసంగమును రికార్డు వినిపించారు. 20 సంస్థలవారు నెహ్రూ చిత్రపటాన్ని పుష్పమాలలతో అలంకరించారు. సర్వశ్రీ పి. వి. నరసింహారావు, తోట రామస్వామి (మంత్రులు), డా॥ ఎ. బి. నాగేశ్వరరావు, ఆవసరాల రామారావు, డా॥ కన రాజు, నిడమర్తి నరసింహం, పోతుల వీరభద్రరావు, డి. భాస్కరరావు, ఉండవల్లి సత్యనారాయణ ప్రభృతులు శ్రీ॥ శ్రీ॥ నెహ్రూకు జోహారు అర్పిస్తూ ప్రసంగించారు. పట్టణ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ నలుమూరి పోతరాజు వందన సమర్పణ చేశారు. (స్వ. వి.)

### పెన్నానదిలో

మంత్రి శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి పినాకినీ నదిలో స్నానమాచరించి, ఉత్తరాభిముఖుడై, బ్రాహ్మణులు మంత్రాలు చెబుతుండగా స్వర్గీయ నెహ్రూ చితాభస్మమును పవిత్ర ఉత్తర పినాకినీ (పెన్నానది)లో కలిపారు. ఆంధ్రప్రదేశ్ స్పెషల్ పోలీసులు 21 తుపాకులను గౌరవ సూచకంగా మూడుసార్లు గాలిలోకి కాల్చారు. ఈ పోలీసులకు శ్రీ వెంకటస్వామి (ఆర్. ఎస్. ఐ.) ఆధ్వర్యం వహించారు. పెన్నానది ఆనకట్టవద్ద 30 వేలమంది ప్రజలుచేరి నెహ్రూ చితాభస్మ నిమజ్జనమును చూచారు. ఆనకట్టవద్ద ప్రత్యేక పందిరి వేయబడినది. అంతకుముందు నెహ్రూ చితాభస్మపాత్ర ఊరేగింపును పలుచోట్ల, చితాభస్మ నిమజ్జనమును వాహినీ ప్రొడక్షన్సువారు ఫిల్ముతీశారు.

'ఏ. సి. సుబ్బారెడ్డి కాయకూరల మార్కెట్‌వద్ద బీదలకు అన్నదానము జరిగినది.

నెహ్రూ చితాభస్మ పాత్రను ఎస్. సి. సి. ట్రక్కుపై వుంచి ఊరేగింపుగా పెన్నానదికి తీసుకపోవడమైనది. ఉదయం 8–45గంటలకు ఊరేగింపు ప్రారంభమైనది. సెకండ్ ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక పోలీసుదళమువారు తుపాకులను వెనక్కుత్రిప్పి పట్టుకొని ఊరేగింపు ననుసరించారు. పోలీసు బ్యాండుదళమువారు శోకపూరితముగా బ్యాండు వాయిస్తూ ముందు నడచారు. జిల్లాకలెక్టరు శ్రీ వి. వెంకటేశ్వరరావు, మంత్రులు శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డి, శ్రీ ఎ. బలరామిరెడ్డి, శ్రీ వేమూరు లక్ష్మయ్యగార్లు నెహ్రూ చితాభస్మ పాత్రను వుంచిన ట్రక్కులో కూర్చున్నారు. అధికారులు, పట్టణ రిజర్వుపోలీసులు, హోంగార్డులు వేలాది ప్రజలు విద్యార్థులు ఊరేగింపులో పాల్గొన్నారు. ఊరేగింపు రంగనాథస్వామి దేవస్థానం దగ్గరికిరాగానే, దేవస్థానంవారు నెహ్రూ చితాభస్మ పాత్రకు ఆలయ మర్యాదలు జరిపారు. దేవాలయానికి చెందిన గొడుగులన్నిటిని తీసుకవచ్చి, చితాభస్మపాత్రకు నీడగా పట్టారు. ఎ. సి. సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్‌వద్ద నెహ్రూ చితాభస్మ పాత్రపై ప్రజలు మల్లెపూల వర్షం కురిపించారు. (స్వ. వి.)

### కలకత్తా సమీపంలో

కలకత్తా, జూన్ 10: ఇక్కడకు 16 మైళ్ల దూరంలో వున్న బారక్‌పూర్‌వద్ద గంగానదిలో గాంధిఘాట్‌వద్ద శ్రీ నెహ్రూ చితాభస్మ నిమజ్జనం నేటి ఉదయం జరిగినది.

పశ్చిమబెంగల్ గవర్నరు శ్రీమతి పద్మజా నాయుడు, ముఖ్యమంత్రి శ్రీ సేన్ సహాయంతో ఆ చితాభస్మాన్ని గంగలో కలిపారు. ఆ సందర్భంలో వేదమంత్రాలు పఠించబడినాయి. భక్తిగీతాలు ఆలపించబడినాయి.

తమ ప్రియతమ నాయకునికి అంతిమ జోహార్లు అర్పించడానికిగాను ప్రజలు నది ఒడ్డుకు అసంఖ్యాకంగా వచ్చారు. అంతకుముందు పెద్ద ఊరేగింపు జరిగింది.

### పలసల నిర్మూలనకు నెహ్రూ అమోఘకృషి

#### సమితి సంఘం శ్రద్ధాంజలి

ఐక్యరాజ్య సమితి జూన్ 10: వలసల నిర్మూలనలో శ్రీ నెహ్రూ అమోఘమైన పాత్రను నిర్వహించారని, ఆసియా ఆఫ్రికా ప్రజలు ఆయనకు బాగా ఋణపడి వున్నారని సమితి తాలూకు ప్రత్యేక వలసల సంఘం అధ్యక్షుడు నేడు శ్రీ నెహ్రూకు జోహార్లు చెప్పారు.

సమితి తాలూకు ప్రత్యేక వలసల సంఘం నిన్న శ్రీ నెహ్రూస్మృతి సంతాపాన్ని ప్రకటించి, శ్రద్ధాంజలి ఘటించింది.

ఈ సంఘం సమావేశం ప్రారంభం కాగనే సంఘం అధ్యక్షుడు శ్రీ సో-కౌలిబలి ఇట్లా అన్నారు. "ఈ సంఘం గత సమావేశం అనంతరం సర్వ మానవజాతి, ముఖ్యంగా ఆఫ్రేషియా సమాజం ఒక మహాపురుషుణ్ణి కోల్పోవడం జరిగింది. మహాపురుషుడైన శ్రీ నెహ్రూ అస్తమించారు. తమ సర్వ జీవితాన్ని శాంతికి, పరిహారానికి ధారపోసిన మహాపురుషులకు శ్రద్ధాంజలి ఘటించే విషయంలో ఆలస్యం అనిలేదు."

శ్రీ నెహ్రూస్మృతి పట్ల ఈ సంఘం సానుభూతిని ఆయన నెహ్రూకుటుంబానికి అందజేశారు.

శ్రీ నెహ్రూపట్ల గౌరవం ప్రదర్శిస్తూ సంఘం సభ్యులు మౌనాన్నిపాటించారు.

భారత ప్రతినిధి సంఘం అధ్యక్షుడికి, సభ్యులకు కృతజ్ఞత తెలిపారు.

### రాష్ట్ర సహకార మంత్రుల సమావేశం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, జూన్ 10: రాష్ట్ర సహకారమంత్రుల సమావేశం జూన్ 15 నుంచి హైదరాబాదులో జరుగుతుంది. ఈ విషయాన్ని నేడు ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి వెల్లడి చేశారు.

జూన్ 17, 18 తేదీలలో రాష్ట్ర ముఖ్యమంత్రుల ఆహార వ్యవసాయమంత్రుల సమావేశం బెంగుళూరులో జరుగుతుందనిగూడా ఆయన తెల్లియజేశారు.

# సైప్రస్‌కు భద్రతా మండలి సహాయం

## మకారియోస్ నిర్ణయం: జాన్సన్‌కు ఇనోను జవాబు

నికోషియా, జూన్ 10: సైప్రస్‌పై దండయాత్రకు టర్కీ సన్నాహాలు సాగిస్తున్నందువల్ల భద్రతామండలి సహాయాన్ని అర్థించాలని సైప్రస్ ప్రభుత్వం నిర్ణయించినట్లు అధ్యక్షుడు మకారియోస్ రాత్రి ప్రకటించారు.

### జాన్సన్ లేఖకు ఇనోను జవాబు

అంకారా, జూన్ 9: అధ్యక్షుడు జాన్సన్ వ్రాసిన యిటీవలి లేఖకు టర్కీ ప్రధాన మంత్రి శ్రీ ఇస్మెత్‌ఇనోను వ్రాసిన సమాధానాన్ని యిక్కడి అమెరికా కార్యాలయంవద్ద రాత్రి అందజేయబడ్డది.

ఈ లేఖాంశాలు అధికారరీత్యా వెల్లడికానప్పటికి, సైప్రస్‌లో టర్కీబలాలు దిగటం అంటూ జరిగేపక్షంలో సైప్రస్‌లో రాజ్యాంగ బద్ధమైన పద్ధతిని పునరుద్ధరించటమే వాటిలక్ష్యంగా ఉంటుందని శ్రీ ఇనోను తన సమాధానంలో పేర్కొన్నట్లు భావించబడుతున్నది.

### ధరల అదుపుకు ప్రభుత్వ చర్యలు

న్యూఢిల్లీ, జూన్ 10: ధరలను అదుపు చేయడానికి ప్రభుత్వం తీసుకోదలచిన కొన్ని చర్య లేమిటో శుక్రవారంనాడు పార్లమెంటరీ కాంగ్రెస్‌పార్టీకి చెందిన ధరల ఉపసంఘానికి సూచనగా తెలియజేయబడుతుంది.

అయితే ఆహార ధాన్యాలలో ప్రభుత్వ వ్యాపారం విషయంలో రాష్ట్రాల ముఖ్యమంత్రులతో, సమాలోచించినపిమ్మటగానిజరగదు, ముఖ్యమంత్రుల సమావేశం త్వరలోనే ఏర్పాటుచేస్తారు.

ఇవాళ జరిగిన ధరల ఉపసంఘ సమావేశంలో ఆర్థికమంత్రి శ్రీ టి.టి. కృష్ణమాచారి, ప్రభుత్వ- వ్యాపారం ముమ్మరంకావాలని, చిల్లర అమ్మకంపై కూడా గట్టి కంట్రోలు అవసరమని తాను కొలదిరోజుల క్రితం చెప్పినమాటలు - తన సొంత అభిప్రాయాలని అయితే ఇదివరలో జాతీయ అభివృద్ధిమండలి చేసిన నిర్ణయానికి అనుగుణంగానే ఉన్నవని విశద చేశారు.

### అసమానత్వాల తొలగింపు

#### ముఖ్యమంత్రి ప్రకటన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

**హైదరాబాదు, జూన్ 10: శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి నాయకత్వంలో కొత్త ప్రభుత్వందేశంలోని ప్రాంతీయ అసమానతలను తొలగించటానికి గట్టి చర్యలను తీసుకోవాలనే కోర్కెను ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నేడు పునరుద్ఘాటించారు.**

పత్రికాప్రతినిధులతో మాట్లాడుతూ ఆయన ప్రాంతీయ అసమానతలను తొలగించాలని, వాటిని పెంచుతూ పోవటానికి వీల్లేదని అన్నారు. యావత్తు పరిస్థితిని మదింపువేసి ప్రాంతీయ అసమానతలను తొలగించే విషయమై నిర్ణయంతీసుకోవలసి ఉన్నదని ఆయన ఉద్ఘాటించారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా తాను ఆంధ్రరాష్ట్రానికి మిగతావాటికన్నా ఎక్కువగా ఏదో కావాలనటంలేదని, అయితే ఆంధ్రకు న్యాయం జరగాలని మాత్రమే నొక్కిచెబుతున్నామని, కేంద్రం ప్రాంతీయ అసమానతలను తొలగించే గట్టిచర్యలను తీసుకోవాలని కోరుతున్నామని ఆయనచెప్పారు.

### నెహ్రూకు ఉస్మానియా కళాశాలల శ్రద్ధాంజలి

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాద్, జూన్ 10: వేసవి సెలవుల అనంతరం నిన్న ఉస్మానియా విశ్వవిద్యాలయం, దాని అనుబంధ కళాశాలలను తెరిచారు.

ఈ కళాశాల లన్నిటిలో సిబ్బంది, విద్యార్థులు సమావేశమై నెహ్రూ మృతిపట్ల విచారాన్ని వెలిబుచ్చుతూ సంతాప తీర్మానాలు చేశారు. శ్రీ నెహ్రూకు జోహార్లర్పించిన తదనంతరం ఆ రోజుకు కళాశాలలను మూసివేశారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయ సిబ్బంది, విద్యార్థులు, అన్వరుల్— ఉలూమ్ కళాశాల సిబ్బంది, విద్యార్థులు, కుటుంబనియంత్రణ సంఘము, నారీ సుధార్ సంఘం, సైఫాబాదు సైన్సు కళాశాల సిబ్బంది, విద్యార్థులు, గజానన్ వ్యాయామశాల సభ్యులు, భారత సాంస్కృతిక సేవాసభ సభ్యులు, ఖాద్య సంఘం తాలూకు ఆంధ్రప్రదేశ్ విభాగం, హిందీ ప్రచారసభవారు, ఆర్ట్సు, కామర్సు సాయంత్రపుకళాశాలవారు, పండిత నెహ్రూమృతిపట్ల తీవ్ర సంతాపాన్ని వెలిబుచ్చారు.



వారాపత్రికలలో ప్రచురింపబడే 'లేఖ' గ్రామాలలో సమాచార సాధనంగా ఎలా పనిచేయుచున్నది విషయమై అమెరికా సాంఘిక శాస్త్రజ్ఞుడు ప్రొ. సెక్సొన్ మెనెఫీ, ఆయన సతి ఇటీవల తిపూరు (మైసూరు)లో పరిశోధన కార్యక్రమాన్ని ప్రారంభించారు. సమాచార సాధనంగా 'లేఖ' చక్కగా పనిచేస్తుందని బుజువయింది. ఒక కన్నడ వారపత్రికలో ప్రకటించిన 'లేఖ'ను మెనెఫీ దంపతులు **ఒక గ్రామంలో చూపుతున్నప్పటి చిత్రం.**

# మద్రాసు వార్తలు

### జూన్ 15 నుంచి విద్యుత్ కోత

#### ముఖ్యంగా పరిశ్రమలకు

మద్రాసు, జూన్ 10: మద్రాసు రాష్ట్రంలో జలవిద్యుత్‌శక్తి కొరత ఏర్పడినందువల్ల, విద్యుత్ సరఫరాను తగ్గించడానికి సన్నాయిలో కోతకు రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ కోత ముఖ్యంగా పరిశ్రమలకు అనువర్తిస్తుంది. ప్రస్తుతానికి ఈ కోత వారంరోజులపాటు అమలులో వుంటుంది.

ఈ కోత వివరాలు ఇట్లా వున్నాయి: (1) హై టెన్షన్ పరిశ్రమలకు 50%; (2) మద్రాసు థర్మల్ ప్రాంతంలో 40%; (3) రైల్వేలు, ఆస్పత్రులు, రేడియో స్టేషన్‌లు, విద్యాసంస్థలు మొదలైనవాటికి ఈ కోత అనువర్తించదు.

### డా॥ మొదలియార్ ఎన్నికపై దరఖాస్తు

మద్రాసు, జూన్ 10: మద్రాసు శాసనపరిషత్తుకు మద్రాసు జిల్లా పట్టభద్రుల నియోజకవర్గంనుంచి డా॥ లక్ష్మణస్వామి మొదలియార్ ఎన్నికను సవాలుచేస్తూ శ్రీ ఆర్. ఎ. శేషాద్రి ఎన్నికల కమిషన్ ముందు దరఖాస్తు పెట్టారు. ఈ ఎన్నికలో శ్రీ శేషాద్రిపోటీ చేశారు, కాని నెగ్గలేదు. డా॥ మొదలియార్, ప్రభుత్వంక్రింద లాభం తెచ్చే కొలువులో వున్నారుగనుక, ఆయన ఎన్నిక చెల్లదని దరఖాస్తుదారుడు తమ దరఖాస్తులో పేర్కొన్నారు.

### బియ్యం సరఫరా : చౌకదుకాణాలు

మద్రాసు, జూన్ 10: మద్రాసు రాష్ట్రంలో బియ్యం పంపిణీకిగాను చౌకదుకాణాలను సెప్టెంబరు చివరిదాకా కొనసాగేట్లు చెయ్యడానికి కేంద్రప్రభుత్వం ఆమోదించింది. అంతేగాక ఈ రాష్ట్రంలో చౌకదుకాణాలను 531 నుంచి 700 కు పెంచడానికి కూడా ఆమోదాన్ని ప్రకటించింది.

### శాస్త్రికి ఇస్మాయిల్ అభినందన

మద్రాసు, జూన్ 10: భారత నూతన ప్రధాని శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రిని అభినందిస్తూ ఇండియన్ యూనియన్ ముస్లింలీగ్ అధ్యక్షుడు శ్రీ మొహమద్ ఇస్మాయిల్ ఆయనకు ఒక టెలిగ్రామ్ పంపారు. "చరిత్ర ప్రసిద్ధులైన శ్రీ నెహ్రూకు తమరు తగిన వారసులు" అని శ్రీ ఇస్మాయిల్ ఇందులో శ్రీ శాస్త్రికి తెలియజేశారు.

### పత్రికల మూతపట్ల ఆందోళన

మద్రాసు, జూన్ 10: మద్రాసు నగరంలో దినసెయ్‌ది, నవఇండియా, తమిళనాడు అన్న మూడు దినపత్రికల మూత పట్ల రాష్ట్ర జర్నలిస్టుల సంఘ కార్యవర్గం ఆందోళనను అభివ్యక్తంచేస్తూ ఒకతీర్మానం చేసింది. ఈ పత్రికలమూతను నివారించవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థించింది.

### మద్రాసు విశ్వవిద్యాలయం పరీక్షల ఫలితాలు

మద్రాసు, జూన్ 10: మద్రాసు విశ్వవిద్యాలయం నిర్వహించిన ఈ క్రిందిపరీక్షల ఫలితాలు జూన్ 12 మధ్యాహ్నం 2 గంటలకు విశ్వవిద్యాలయ భవనాలలో ప్రకటింపబడగలవు. (1) బి. ఇ. (2) బి. టెక్; బి. ఎస్‌సి. టెక్. (3) బి. ఆర్క్. (4 బి. టి. (రివైజ్‌డ్ నిబంధనలు, పాత నిబంధనలు) (5) బి. టి (బేసిక్) డిగ్రీ (6 వ్యవసాయం (నాల్గేళ్ల కోర్సు; మూడేళ్ల కోర్సు) (7) బి.ఏ (పాత, కొత్త నిబంధనలు); బి. ఎస్ సి. (పాత, కొత్త నిబంధనలు); బి. కాం. (పాత కొత్త నిబంధనలు); బి. ఎస్‌సి. (హోంసైన్సు).

### నెహ్రూకు శాస్త్రజ్ఞుల సంఘం జోహార్లు

న్యూఢిల్లీ, జూన్ 9: జవహర్‌లాల్ నెహ్రూ మృతిపట్ల తీవ్ర విచారాన్ని వెలిబుచ్చుతూ భారత సైన్సు కాంగ్రెసు అసోసియేషన్ నేడొక తీర్మానం చేసింది. ఈ సంఘానికి శ్రీ నెహ్రూ అధ్యక్షునిగా పనిచేసియున్నారు.

"ఆయన నాయకత్వంలో జాతీయ కార్యక్రమంలోని అంతర్భాగంగా శాస్త్ర విధాన తీర్మానాన్ని ఆమోదించిన మొట్టమొదటి దేశం భారత్" అని తీర్మానం పేర్కొన్నది. ఆయన శాస్త్ర పురోగమనానికి చేసిన కృషిని తీర్మానం ప్రశంసించింది. అణుశక్తి ప్రాధాన్యతను గుర్తించిన మొట్టమొదటి వ్యక్తి శ్రీ నెహ్రూ అని, అణుశక్తిని శాంతియుత కార్యకలాపాలకు వాడుక చేయటాన్ని సమర్థించిన వ్యక్తి అని తీర్మానం పేర్కొన్నది.

### జులై 16 నుంచి శాసన సభ సమావేశం

మద్రాసు, జూన్ 10: మద్రాసు శాసనసభ జులై 16 నుంచి ఒక వారంరోజులపాటు సమావేశం అవుతుంది. మొదటిరోజున ఈ శాసనసభ తాలూకు ఉభయసభలు శ్రీ నెహ్రూమృతికి సానుభూతిని ప్రకటిస్తూ తీర్మానాలు ఆమోదిస్తాయి.

### ఆంధ్రా యూనివర్సిటీ కాలేజి, వాల్తేరు

#### నోటిఫికేషన్

**ఆంధ్ర యూనివర్సిటీ కాలేజీల వివిధకోర్సులలో ప్రవేశములు**

వాల్తేరు, ఆంధ్ర యూనివర్సిటీ కాలేజీల, వివిధ కోర్సులలో ప్రవేశమునకుగాను దరఖాస్తు ఫారములు, ప్రాస్పెక్టసులకై ప్రిన్సిపాల్ వారికి అభ్యర్థనలను 20-5-64 నుంచి 6-6-64 వరకు పంపుకొనవచ్చును.

అభ్యర్థనతోపాటు దరఖాస్తుదారుడు జత చేయవలసినవి: (1) స్వంత చిరునామాగల స్టాంపులు (20 న. పై॥) అతికించబడిన 10" × 4" సైజుగల కవరు. (2) దరఖాస్తు ఫారము ఖరీదుక్రింద వాల్తేరు తపాలా ఆఫీసునందుచెల్లింపబడునట్లు ప్రిన్సిపాల్ ఆంధ్రా యూనివర్సిటీ కాలేజీలు, వాల్తేరు వారిపేర (హోదాపేర) జారీచేయబడిన రు. 1/– (ఒక రూపాయి మాత్రము) విలువగల ఇండియన్ పోస్టల్ ఆర్డర్. పోస్టలు ఆర్డరు మే 1 వ తేదీకి ముందుగా జారీచేయబడియుండకూడదు. పోస్టల్ ఆర్డరుపై ఎట్టి మార్పులు సవరణలు చేసియుండరాదు.

ఆంధ్రా యూనివర్సిటీ కాలేజీల అన్ని కోర్సులలో ప్రవేశమునకు దరఖాస్తులు నిర్ణీత అచ్చువేసిన దరఖాస్తు ఫారములలోనే 25-6-64 తేదీలోగా పంపవలెను. అభ్యర్థులు ప్రవేశమునకై తాము దరఖాస్తు చేయు కోర్సుపేరును స్పష్టముగా వ్రాయవలెయును. వివిధకోర్సులకు వేరువేరుగా దరఖాస్తుఫారములు ఉపయోగించవలయును.

పైన తెలిపిన రెండు ఎన్‌క్లోషర్స్ అనగా (1) స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు మరియు (2) దరఖాస్తుఫారం ఖరీదు (ఒకరూపాయి పోస్టల్ ఆర్డర్) లేని అభ్యర్థనలనుగూర్చి ఎట్టిచర్య తీసుకోబడదు.

**ఆంధ్రా యూనివర్సిటీ కాలేజీలు, వాల్తేరులో లభ్యమగు స్టడీకోర్సులు**

1. ఇంజనీరింగ్ : 5 సంవత్సరములు ఇంటిగ్రేటెడ్ ఇంజనీరింగ్, 3 సం॥ల సివిల్ ఇంజనీరింగ్ డిగ్రీకోర్సు, సివిల్ మెకానికల్ మరియు ఎలెక్ట్రికల్‌లో ఎం. ఇ. కోర్సు.
2. టెక్నాలజీ : బి. టెక్. కెమికల్ ఇంజనీరింగ్ మరియు ఎం. టెక్.
3. ఫార్మసీ : బి. ఫార్మ, ఎం. ఫార్మ.
4. లా : బి. ఎల్; ఎం. ఎల్.
5. కామర్స్ : ఎం. కామ్., ఎం. బి. ఏ. (మాస్టర్ ఆఫ్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్)
6. ఆర్ట్సు : క్రింది సబ్జక్టులలోఎం. ఏ. డిగ్రీ:

1) లెక్కలు (1) ఫిలాసఫీ (3 a) హిస్టరీ (3b) పాలిటిక్స్(4)ఎకనమిక్స్(5)ఇంగ్లీషు భాష మరియు సాహిత్యము (6) సంస్కృత భాష మరియు సాహిత్యము (7) తెలుగుభాష మరియు సాహిత్యము (8) సోషియల్ వర్క్ (9) ఆంత్రొపాలజీ (10) అప్లయిడ్ ఎకనామిక్స్.

7. సైన్సు : ఎం. ఎస్‌సి. డిగ్రీ క్రింది శాఖలలో :

మాథమాటికల్ ఫిజిక్స్, ఫిజిక్స్, న్యూక్లియర్ ఫిజిక్స్, కెమిస్ట్రీ (ఆర్గానిక్, ఇనార్గానిక్, అనలిటికల్ మరియు న్యూక్లియర్ కెమిస్ట్రీలలో స్పెషలైజేషన్‌తో) బాటనీ, జూఆలజీ, జియాలజీ, ఓర్—డ్రెస్సింగ్ & స్టాటిస్టిక్స్. ఎం. ఎస్‌సి. (టెక్) : దిగువతెలిపిన యే ఒక సబ్జెక్టులో నైనను : అప్లయిడ్ ఫిజిక్స్, జియోఫిక్స్, మెటియోరాలజీ మరియు ఓషనోగ్రఫీ, అప్లయిడ్ జియాలజీ.

8. పోస్టుగ్రాడ్యుయేట్ : కో-ఆపరేషన్ మరియు రూరల్‌స్టడీస్‌నందు డిప్లమాకోర్సు.
9. క్రింది సబ్జక్టులలో డిప్లమా కోర్సు :

లైబ్రేరియన్‌షిప్, హిందీ (పార్టు టైమ్ కోర్సు), జియోగ్రఫీ, థియేటర్ ఆర్ట్సు & ఆక్టింగ్ (పార్టుటైమ్‌కోర్సు.)

10. ఐ.ఏ.ఎస్‌కు శిక్షణసౌకర్యములు—రీసెర్చి, పి. హెచ్. డి. డిగ్రీ—హ్యుమానిటీస్ మరియు సైన్సు సబ్జక్టులలో పరిశోధనా సౌకర్యములు లభించును.

(సం) జి. గోపాలరావు,
ప్రిన్సిపాల్.
ఏ. యు. కాలేజీలు, వాల్తేరు.

# సామ్యవాద స్థాపనకు ఐక్యకృషి: మెహతా విజ్ఞప్తి

## నెహ్రూ ఆశయసిద్ధికి కృషిపై వివరణ

లక్నో, జూన్ 10 ; "రానున్న దశాబ్దం ఒక సవాలువంటిది. కాంగ్రెస్ పార్టీలోని సామ్యవాద శక్తులు, ఇతర సోషలిస్టుశక్తులు దానిని సమైక్యంగా ఎదుర్కొనాలి" అని ప్రణాళికాసంఘం ఉపాధ్యక్షుడు శ్రీ అశోక మెహతా నేడు ఉద్బోధించారు.

1975-76 సంవత్సరానికి ప్రభుత్వ స్వామిగ రంగం దేశం మొత్తం పెట్టుబడిలో సగానికిపైగా పొందివుండి దేశఆర్థిక వ్యవస్థలో కీలక స్థానంలో వుండగలదని శ్రీ మెహతా అన్నారు.

సామ్యవాద శక్తులు ఉత్పత్తిని వృద్ధిచెయ్యవలసివుంటుందని, ఉత్పత్తిని న్యాయంగా పంపిణీ చెయ్యవలసివుంటుందని ఆయన అన్నారు.

మెహతా అభిప్రాయం ప్రకారం సోషలిస్టులు ఏర్పాటుచేసిన సమావేశం సోషలిస్టు పార్టీ మహాసభకు శ్రీ మెహతా ప్రారంభిస్తూ అభివృద్ధి కృషిలో, ఆర్థిక ప్రణాళిక విముక్తి ఉద్యమంలో అభ్యుదయదాయకమైన విప్లవం కొనసాగింపులో కమ్యూనిస్టులుకూడా పాల్గొనవచ్చునని అన్నారు.

జమ్మూ కాశ్మీర్ తోసహా 11 రాష్ట్రాలనుంచి 900 మందికిపైగా ప్రతినిధులు మహాసభకు హాజరైనారు.

రెండురోజులపాటు మహాసభ జరుగుతుంది

ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీమతి సుచేతాకృపలానీ నేటి సమావేశంలో మాట్లాడుతూ సామ్యవాదంలో నమ్మకంవున్నవారంతా ఒకే వేదికపై చేరి సోషలిస్టు పునర్నిర్మాణానికి పాటుపడవలసిందని కోరారు. ఈ మహత్తర కార్యనిర్వహణకు ముందుకువచ్చేవారు కాంగ్రెస్‌లో చేరగలమనే ఆశిస్తున్నానని, కాంగ్రెస్‌పార్టీయే ప్రజల అభీష్టాలను నెరవేర్చ కలుగుతుందని వ్యాఖ్యానించారు. ఉత మలక్ష్యాలు పెట్టుకొనే కాంగ్రెస్‌లో చేరదగునన్నారు.

సభాధ్యక్షతవహించిన శ్రీ ఈశ్వర్‌భాయ్ దేశాయ్ మాట్లాడుతూ దేశం ఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితి గురించి ప్రస్తావించి సామ్యవాదశక్తులు బలపడవలసిన అగత్యాన్ని వివరించారు.

శ్రీ అశోక్ మెహతా తన ప్రసంగంలో దేశాన్ని ఎదుర్కొంటున్న బృహత్ సమస్యలు గురించి ప్రస్తావించి ఇట్టి తరిలో సోషలిస్టులు భిన్నాభిన్నమై వుండడం పాతకమన్నారు.

సామ్యవాదులు బలపడితే జాతీయాదాశయం వంపిణీపై కూడా వారి ప్రభావం పడగలదన్నారు.

శ్రీ మెహతా తన ప్రసంగంలో ఇంకా క్రిందివిధంగా పేర్కొన్నారు :

"దేశ ఆర్థికవ్యవస్థను ఆధునిక పద్ధతులలో పునర్నిర్మించడంలోను, దానిపై ప్రభుత్వాన్ని యాజమాన్యం వృద్ధిపరచడంలోను వచ్చే పదేళ్ళలో సోషలిస్టులు ముఖ్యపాత్ర నిర్వహించవలసి వున్నది. ఈ రెండుకార్యాలు నెరవేరినవెంటనే జాతీయాదాయ విస్తరణ ప్రారంభంకాగలదు. పరిశ్రమల ఆధునికీకరణ, వ్యవసాయంతో సహా వివిధరంగాల ఆర్థికవ్యవస్థలకు వీలై నంతత్వరగా అధునిక సాంకేతిక ప్రాతిపదికలు ఏర్పాటుచెయ్యడం అవసరమై వున్నది. అంటే జాతీయార్థిక వ్యవస్థకు చెందిన అన్నిరంగాల అవసరాలను, రక్షణావసరాలను మన కీలక పరిశ్రమలు తీర్చగలగాలి. వ్యవసాయోత్పత్తి వృద్ధికిగాను విద్యుచ్ఛక్తి, రసాయనపు ఎరువులు, క్రిమిసంహారక పదార్థాలు, పనిముట్లు మొదలైనవి సమకూరాలి. జీవనవ్యయు ప్రమాణం పెరుగుతున్న ప్రజలకు వాడకం సరుకులను లఘుపరిశ్రమలు ఉత్పత్తిచెయ్యాలి.

ఆర్థికాభివృద్ధి రథమునకు భారీ పరిశ్రమలు, వ్యవసాయం రెండు చక్రాలువంటివి, అందులో ఏది దెబ్బతిన్నా రథం కూలిపోతుంది.

'భారత ప్రజాసామాన్యం యింకా సామ్యవాద వ్యవస్థలోకిరాలేదు. సహకారసంఘాలు, కార్మిక సంఘాలు, విద్యా కేంద్రాలు మొదలైనవాటి సహాయంద్వారా ప్రజలకు సోషలిజం ప్రయోజనాలు సాధించాలి.

"కాంగ్రెస్‌తో పోటీ చెయ్యదలచిన సోషలిస్టులు ఇందువల్ల ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణంలో అనవసరమైన జాగు జరగగలదని, మార్పునుకోరని వారికి ఈ తగవు బలమివ్వగలదని గ్రహించవలెను.

"కాంగ్రెస్ నేడు పరిపాలన సాగించడమేకాక సామ్యవాద స్థాపనను లక్ష్యంగా పెట్టుకొని వున్నది. ప్రజల ఉత్సాహము, రాజకీయశక్తి కలసి అభివృద్ధిదాయకమైన విప్లవం సాధించేందుకు సోషలిస్టులు సహాయపడాలి.

"కాంగ్రెస్ పునాదులపై ప్రజాస్వామిక సామ్యవాద భవనం నిర్మించేందుకు శ్రీ నెహ్రూ పథకాలు సిద్ధపరచి వున్నారు. ఇక ఇప్పుడు ప్రతి సామ్యవాద కర్తవ్యము ఆ భవన నిర్మాణం పూర్తి చెయ్యడమే కాంగ్రెస్‌లోనే సామ్యవాద శక్తిని పటుతరం చెయ్యగలమని నెహ్రూకు మన మిప్పుడు శపథం చెయ్యాలి."





# శాస్త్రి మంత్రివర్గం

## మెహతాబ్ మద్దతు

న్యూఢిల్లీ, జూన్ 9 : నూతన మంత్రివర్గ సభ్యులను ఎంపికచేయడానికి సంబంధించినంతవరకు, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి పూర్తి న్యాయం చేశారని కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ సీనియర్ సభ్యుడు డాక్టర్ హరేకృష్ణ మెహతాబ్ తెలియజేశారు.

దేశాన్ని ఎదుర్కొంటున్న అనేక సమస్యలను గురించి కొత్త ప్రభుత్వం త్వరగా యోచన చేయగలదనే ఆశిస్తున్నానని ఆయన చెప్పారు. ఈ సమస్యలు తక్షణం పరిష్కరింపబడవలసినవని ఆయన అన్నారు.

## నిజలింగప్ప సంతృప్తి

బెంగుళూరు, జూన్ 9: కేంద్రంలో నూతన మంత్రివర్గ నిర్మాణాన్నిగురించి మీ అభిప్రాయమేమని మైసూర్ ముఖ్యమంత్రి శ్రీ ఎస్. నిజలింగప్పను పత్రికా ప్రతినిధులు నేడు ప్రశ్నించగా, "నాకు పూర్తి సంతృప్తి కలిగింది" అని ఆయన జవాబిచ్చారు,

శ్రీ హెచ్. సి. దాసప్పకు యిప్పుడు కొత్తగా అప్పగించబడిన నీటివనరులు విద్యుచ్ఛక్తిశాఖ ఇంతకు ముందు ఆయన నిర్వహించిన రైల్వేశాఖకంటె కొన్ని విషయాల్లో మరింత ప్రధానమైనదని శ్రీ నిజలింగప్ప తెలిపారు.

## "కల్కి" నవలకు రష్యన్ అనువాదం

మాస్కో, జూన్ 9 : ప్రఖ్యాత తమిళ నవలా రచయిత శ్రీ "కల్కి" రచించిన "అలలోసై" అనే నవల రష్యన్ భాషలోనికి అనువదించబడింది.

# కాశ్మీర్ జాతీయమహాసభ కాంగ్రెసుపార్టీతో విలీనం

జమ్మూ, జూన్ 10 : కాశ్మీర్ జాతీయ మహాసభను, భారత జాతీయ కాంగ్రెస్‌లో విలీనం చేయటాన్నిగురించి జాతీయ మహాసభ శాసనసభ్యులు నిన్నటి సమావేశంలో చర్చించినట్లు తెలుస్తున్నది.

ఈ సందర్భంలో తగు చర్యలు తీసుకొటానికి జమ్మూ జాతీయమహాసభ అధ్యక్షునికి అధికారం యివ్వబడ్డది.

రాష్ట్రంలోని అధికారపక్షమైన జాతీయ మహాసభను భారతజాతీయ కాంగ్రెసును సన్నిహితంగా తీసుకురావటం జరుగుతుందని బక్షి గులామ్ మహమ్మద్ కొద్దిమాసాల క్రితం ప్రకటించి ఉన్నసంగతి విదితమే అయితే ఆ తరువాత ఆ విషయమై ఎట్టిచర్యలు తీసుకొనబడి ఉండలేదు.

## పారిశ్రామిక వస్తూత్పత్తి

### 90 మిలియన్‌డాలర్లు ఐ. డి. ఏ. సహాయం

వాషింగ్టన్, జూన్ 10 : భారతదేశంలో పారిశ్రామికవస్తూత్పత్తి అభివృద్ధికి వినియోగించుటకుగాను ప్రపంచబ్యాంకు అనుబంధమైన అంతర్జాతీయ అభివృద్ధిసంస్థ (ఐ. డి. ఏ) 90 మిలియన్‌డాలర్ల సహాయాన్ని నిన్న ప్రకటించింది.

లారీలు, యంత్రాలు, కట్టడపు పరికరాలు తయారుచేస్తున్న కంపెనీలకు సహాయంగా ఈ మొత్తం వినియోగించబడుతుంది.

## నీగ్రోల ఘర్షణ

టస్కలూసా (అలబామా), జూన్ 9 : పోలీసులకు, నీగ్రోలకు ఇక్కడ నిన్న జరిగిన ఘర్షణలో నలుగురు పోలీసులు, 32 మంది నీగ్రోలు క్షతగాత్రులయినారు.

పౌరహక్కుల ప్రదర్శకుల ఊరేగింపుకు పోలీసులు అనుమతిని నిరాకరించడంతో ఈ పోరాటం ప్రారంభమైంది. ఇది దాదాపు ఒక గంటసేపు సాగింది.

ఊరేగింపుకు పోలీసులు నిరాకరించగానే నీగ్రోలు పోలీసులపై రాళ్లు మొదలైనవి విసిరారు.

ఈ సందర్భంలో 60 మందిని అరెస్టు చేశారు.



"పెంచికెల నవల ఒక రూపాయి మాత్రమే. వి. పి. పద్ధతి లేదు. పోస్టేజి అదనము. ప్రచురణ: శ్రీ గాయత్రి ప్రెస్, విజయవాడ-3.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna, at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Acting Editor: P. SriRamulu, Phone: Madras: 22244&21747. Hyderabad:42703.